# వెన్నెల [illegible]





విజయకృష్ణ కంబైన్స్‌వారు ప్రారంభించిన 'కన్నిటి కథ' అనే చిత్ర ప్రారంభోత్సవానికి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు హాజరై ఆశీర్వదించారు. ఫోటోలో ముఖ్యమంత్రి ప్రక్కన హీరో కృష్ణ, మంత్రి 'మండలి', ఎం. పి. శ్రీనివాసరావు, సమాచార శాఖ డైరెక్టర్ రాజ్యంసిన్హా, నటి సావిత్రిగార లుండటం చూడనగును. మైకు దగ్గిర నటి విజయనిర్మల మాట్లాడుతున్నారు.



ఇటీవల ఏడు వారాల పాటు అమెరి కాలో పర్యటించి తను వీణానాదంతో అక్కడి శ్రోతలని ముగ్ధులని చేసి స్వదేశానికి తిరిగి వచ్చిన ప్రఖ్యాత తెలుగు వైణిక విద్వాంసుడు శ్రీ చిట్టిబాబు.



ఈ క్రింది బొమ్మలో వున్నది : గర్భనిరోధక మాత్రల్లో ఉపయోగపడే రసాయనిక ద్రవ్యం "డియోస్జెనిన్" అనే దానిని చెప్పుకోతగిన మొత్తాలలో యిచ్చే "కంద మూలం." ఈ "దుంప" పేరు "డియో స్కోరియా ఫ్లోరిబండా". రైతులకు ఈ డియోస్కోరియా దుంప వేస్తే ఎకరానికి రు. 4 వేల దాకా సాలీనా ఆదాయం వస్తుందని, కర్ణాటక రాష్ట్రంలో "హెస్సార్ ఘట్టాలోగల" ప్రభుత్వ పరిశోధనా సంస్థ వారి కథనం.



## చిలకలూరిపేట కళా సదస్సు

# నాటకోత్సవాలు

... 27వ తేదీ వరకు అఖిలభారత స్థాయిలో తెలుగు నాటకోత్సవాల పోటీల ఫలితాలు



కళాసదస్సు కరెస్పాండెంటు శ్రీ యస్. మస్తాన్‌వలి మరియు అధ్యక్షులు శ్రీ నారాయణమూర్తిగారు

నాటక పోటీలో ఉత్తమ ప్రదర్శన : "జగన్నాథ రథచక్రాలు" (స్నేహ సమాఖ్య, ఒంగోలు.) ద్వితీయ ప్రదర్శన : "మరో మొహంజదారో" (నటరాజ కళానిలయం, విజయవాడ.) "సంధ్యారాగంలో శంఖారావం" (కళాభారతి, విజయవాడ.) ఉత్తమరచన : "జగన్నాథ రథ చక్రాలు" ఉత్తమనటుడు : శ్రీ యాద్రంనేని చంద్రమవులి (హైదరాబాదువారి "కీర్తిశేషులు"లో మురారి పాత్రదారి.) ఉత్తమ నటి : శ్రీమతి యస్. డి. లక్ష్మి ("జ్వాలాశిఖలు"లో పూర్వాశి పాత్ర ధారిణి.) నాటికలు : ఉత్తమ ప్రదర్శన : "ఆగండి, కొంచెం ఆలోచించండి" ('గురజాడ ఆర్ట్సు' విశాఖపట్నం.) ద్వితీయ ఉత్తమ ప్రదర్శన : "కట్న" (ఆర్. టి. సి. విజయవాడ.) ఉత్తమ రచన : "స్వాతివాన" (రచయిత గణపుల లోకనాథ్, భిలాయ్, మధ్యప్రదేశ్.) ఉత్తమనటుడు: "కృష్ణచైతన్య" (ఆగండి, కొంచెం ఆలోచించండిలో పిన్నేడు పాత్రదారి) ఉత్తమనటి : కుమారి బృంద (పావలాలో దేవుడమ్మ పాత్రధారిణి) ఉత్తమవిలన్ : వంకాయల సత్యనారాయణమూర్తి (గరీబీహటావోలో నాగరాజు పాత్రదారి.)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం : 2-8-'74

శ్రీ ఆనందనామ సం. శ్రావణమాస శు. చతుర్దశి

సంపుటము : 67 సంచిక 44

స్థాపితం : 1908

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-3.

సంవత్సర చందా – రు. 31-20 పై.
ఆరుమాసాల చందా – రు. 15-60 పై.
విడి ప్రతి వెల 55 పైసలు


## విషయానుక్రమణిక



# ఆంధ్రసచిత్రవారపత్రిక

# 1974 దీపావళి కథల పోటీ - బ్యాలట్ !

## నాలుగు కథలు : మొత్తం రూ. 5000 ల బహుమతులు!

ఏటా నిర్వహిస్తున్నట్లే యీ ఏడాది కూడా ఆంధ్ర సచిత్ర వారపత్రిక దీపావళి సంచిక ప్రత్యేక ఆకర్షణగా 'కథల' పోటీ నిర్వహిస్తున్నాము.

**ముగింపు తేదీ : 20-9-1974**

ఐతే యీసారి "కథల" సంఖ్య తగ్గించి బహుమతుల మొత్తాన్ని పెంచాము పోటీకివచ్చిన కదలలో సంపాదకుని ఎన్నికలో అత్యుత్తమంగా తేలిన నాలుగు కదలకు ఒక్కొక్క కథకు రు *750* చొప్పున పారితోషికం అందజేస్తాము ఇదిగాక యీ నాలుగు కథలను ప్రచురించి వాటిపై పాఠకుల అభిప్రాయాన్ని బ్యాలట్ పత్రరూపంలో తీసుకోదలిచాము.

బ్యాలట్‌లో ప్రథమ స్థానాన్ని పొందిన కథకు అదనపు బహుమతి రు *650* యిస్తాము ద్వితీయ స్థానం, తృతీయ స్థానం పొందిన కథలకు ఆ క్రమంలో రు *550* రు. *450*లను అదనపు బహుమతులుగా పంపుతాము చివరి కథకు రు *350*లు అదనపు బహుమతిగా పంపుతాము అంటే దీపావళి కథలు నాలుగింటికి రు *1400*లు, రు *1300*లు రు. *1200*లు, రు *1100*లు ఆ వరుసలో బహుమతులు అందుతాయన్నమాట.

## * నిబంధనలు *

* ★ సంపాదకుని ఎన్నికలో నెగ్గిన నాలుగు కథలను దీపావళి సంచిక, ఆ తరువాతి సంచికలలో అప్పటి వీలును బట్టి ప్రచురిస్తాము ఈసారి విజేతల పేర్లు, వివరాలుకూడా బ్యాలట్ ఫలితాలతో పాటే ప్రకటించాలని నిర్ణయించాము ముందుగా కథలతో పాటు ప్రకటించము కథల ఎన్నికలో పాఠకుల సౌలభ్యంకోసం యీ మార్పు చేస్తున్నాము
* ★ రచన తెనుగువారి సామాజిక జీవితానికి సంబంధించినది అయి వుండాలి తేటతెనుగ వ్యావహారిక భాషలోనే వ్రాయడం అవసరం రచన 12 అరఠావులకు మించరాదు లోగడ అచ్చుఅయిన ప్రసారమైన కథలను పంపరాదు అనువాదం, అనుకరణ కారాదు ఈ మేరకు రచయిత హామీ పత్రం కథతోపాటే జతపరచి మరీ పంపితీరాలి రచనపై పేచీలు వస్తే బాధ్యత రచయితలదేనన్న మాట గుర్తుంచుకోవాలి.
* ★ 1974 దీపావళి కథలపోటీ సంపాదకుడు ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-3 అన్న చిరునామా కవరుపై స్పష్టంగా వ్రాయాలి
* ★ పోటీలో గెలిచే కథా రచయితలు తమ ఫొటో, జీవిత విశేషాలు పంపితే వాటి ప్రచురణకు అంగీకరించాలి తమ ఫొటో, వివరాలు పత్రికలో పడటం యిష్టంలేని రచయితలు పోటీకి కథలు పంపకపోవడం మంచిది
* దీపావళి పోటీకి వచ్చిన రచనలు తిప్పి పంపలేము కనుక స్టాంపులు, స్వంత కవరులు మొదలైనవి కథలతోపాటు పెట్టకూడదు పోటీకి వచ్చిన కొన్ని కథలను వాటి స్థాయిని బట్టి మామూలు ప్రచురణకు స్వీకరించే అవకాశముంది ఆ విధంగ స్వీకరించిన కథకులకు ఆ విషయం దీపావళి తరువాత నాలుగు వారాలలోగా తెలియచేయడానికి ప్రయత్నిస్తాము. —సం

# మనలో మాట

ఈ ఏడాది పెట్టిన దీపావళి కథల పోటీలో కొన్ని మార్పులు తెచ్చాము కొంతమంది రచయితలు, చాలా మంది పాఠకులు చేసిన పలు సూచనలే యీ చిన్న మార్పులకు కారణాలు కూడాను. కథల సంఖ్య నాలుగుకు తగ్గించి బహుమతుల ద్రవ్య ప్రమాణాన్ని పెంచాము. సంపాదకుని ఎన్నికలో తేలిన నాలుగు కథలను—రచయితల పేర్లు లేకుండా ప్రచురించి పాఠకుల అభిప్రాయాలను తెలుసుకోవాలని నిర్ణయించాము. ఈ పోటీ గురించి వేరే అన్ని వివరాలు యీ సంచికలోనే యిచ్చాము.



ఈ వారం కొత్త సీరియల్ కథ అతకని అనుబంధాలు వేశాము. రచయిత శ్రీ పి. యస్. శాస్త్రి సుప్రసిద్ధ కథా రచయిత. 1942 లో పశ్చిమ గోదావరిజిల్లాలో పుట్టి కాకినాడలోనే విద్యాభ్యాసం పూర్తి చేసుకుని సివిల్ యింజనీరింగ్ డిప్లొమా పొందారు. ఉద్యోగం పి. డబ్ల్యు. డి. శాఖలో. ప్రస్తుతం నాగార్జున సాగర్‌లో వుంటున్నారు.

* * *

శుభోదయం (14-6-74) కథ ఇంతకు ముందే 'వత్సల' పేరుతో పడిన కథ అని మాకు కొంతమంది పాఠకులు తెలియజేశారు. ఈ ఆరోపణపై రచయిత్రి శ్రీమతి బొమ్మ హేమాదేవిగారు పంపిన సమాధానాన్ని యీ వారం ఉత్తరాల శీర్షికలో వేశాము. ఈ విషయం మా దృష్టికి తెచ్చిన పాఠకులకు కృతజ్ఞత.

సుప్రసిద్ధ నటులు శ్రీ యస్. వి. రంగారావు ఆకస్మిక మరణవార్త మా కందేసరికి యీ సంచిక అచ్చయిపోతున్నది—ముద్రణ ఆపి, ఆ మహానటునికి 'నివాళి'గా యిదే పేజీలో ఒక వ్యాసం వేశాము.

## ఒక 'తార' రాలిపోయింది!

నటుడుగా 300 చిత్రాల క్రెడిట్ — నిర్మాతగా మూడు మణిపూసల క్రెడిట్ — దర్శకునిగా రెండు చిత్రాల 'అవార్డు'ల క్రెడిట్ గల యస్. వి. రంగారావు యశస్వి రంగారావై పోయాడు. పోయాడు వెండితెరతో ఋణానుబంధం త్రెంచుకు పోయాడు! తెరమరుగై పోయి తెనుగు తమిళ వెండితెరను చిన్నదాన్నిచేసి వదిలిపోయాడు...



కాని మరెన్నో వందల చలన చిత్రాలు యీ సినిమా రంగం తీసిం తరువాత కూడా తెనుగువాడు ఈ "సినిమా రంగారావు" ను "గర్వంగా మా రావు" మా 'బంగారు పాప' రావు, మా 'హరిశ్చంద్రుడు" రావు, మా 'మొనగాడు' రావు, మా 'మాయల మరాఠీ,' జకార్తాలో అవార్డు కొట్టుకొచ్చిన 'కీచకుడు' మా రంగారావు అంటూ అందరూ చెప్పుకొనేటంత గాఢంగా చరిత్రలో మిగిలిపోయినవాడై యిహలోక యాత్ర చాలించాడు.

రంగారావు లాంటి "క్యారెక్టర్ నటుడు" మరి లేడన్న ఒక్క 'అవార్డు'—అశేష ఆంధ్ర తమిళ ప్రేక్షక మహాజనం యిచ్చిన అమూల్యమైన 'అవార్డు' ను మాత్రం తన జ్ఞాపక చిహ్నంగా యీ సినిమా చరిత్రకు వదిలేసి హృద్రోగం తీసిన దెబ్బ ఒక్కదానికి మాత్రం తల వొంచి ప్రాణాలిచ్చిన రంగారావు రౌద్ర, క్రౌర్య, వీర, హాస్య, కరుణ రసాలన్నింటిని కాచివడబోసి, ఎటువంటి పాత్రనైనా అవలీలగా తన దాన్ని చేసుకుని పోషించి ఒక ప్రాణాన్ని దానిలోపోసి మరీ నటించి—మహానటుడై రాణించి— ... చెరగని ముద్రవేసి చిరకీర్తి కాయుడైనాడు

నాటకాలు వేసినవాడు. నాటకం ట్రూపును దేశం మీద త్రిప్పినవాడు—సినిమాలు తీసిన వాడు—తీసిన నాటికి ప్రభుత్వం గుర్తింపును కూడా పొందినవాడు. 57 సం. లకే వెళ్లిపోయి "అన్నా! రంగారావూ! నీ కింకా చాలా అవార్డులు, చాలా కీర్తి కిరీటాలు" యివ్వాలను కుంటున్నదయ్యో యీ "సినిమా లోకం—". అంటున్న తన "కెరీర్" అత్యున్నత దశలో ఒక "తారగా" రాలిపోయాడు... రంగారావుకు 'పాతాళభైరవి' నుంచి 'అందరూ దొంగలే'దాకా అన్నీ విజయాలే. 'బంగారుపాప'నుంచి "బంగారు కలలు" దాకా అన్నీ ఘన విజయాలే లభించాయి.

తెరమీద కత్తి పట్టినా, 'కాంత' కొంగు పట్టినా, కన్నీరొలికించినా, కనుబొమలు ముడి వేసినా, ప్రేక్షకుణ్ణి పులకరింపచేసే యశస్వి, అద్భుత నటుడూ అయిన ఎస్. వి. రంగారావు జూలై 3న పుట్టినరోజు చేసుకుని జూలై 18న అంత వరకూ సరదాగా ఉంటూనే ఆ సాయంకాలం అస్తమిస్తున్న సూర్యుణ్ని వెతుక్కుంటూ వెళ్లి పోవడం—దక్షిణాది చిత్రరంగం చేసుకున్న దుర దృష్టం—అతను లేనిలోటు చిత్రసీమకు తీరనిది.

(వీరాజీ)

## ఉత్తరాలు

శుభోదయం రచయిత్రి సమాధానం

ఆంధ్ర సచిత్రవారపత్రిక సంపాదకులకు: నమస్కారములు. మీ ఉత్తరం అందింది. నేను రెండు మూడు కలంపేర్లతో కథలు నవలలు రాయటం జరిగింది. "దేవిరమ" నా కలం పేర్లలో ఒక పేరు.

[43 వ పేజీ చూడండి]



పెట్రోలు
ద్రవ్యోల్బణం
పెట్రోలు
ధనిక వర్గంలో దుబారా
పరిపాలనలో దుబారా
అగ్నికి ఆజ్యం




నల్లడబ్బు, నల్లడబ్బుంటూరు అర్థం లేకుండా? మరి అది లేకుండా ప్రజాస్వామ్య రథ చక్రాలకి కందెనతైలం ఎలా వస్తుంది?




పదవిని నేనే గెలుచుకున్నాను!
ఎన్నిక అనేది- నామ మాత్రమే!






ఓయ్, మిత్రమా! భారత్ మీదకి నేనుకూడా సైన్యాన్ని నడిపాను। ఏం జరిగిందో నీకూ తెలుసును!
సరిహద్దులలో పాకిస్తాన్ సైన్యం మోహరు


OOMMEN

సీరియల్

# అంతకని అనుబంధాలు

పి.యస్.శాస్త్రి

మధ్యాహ్నం పదకొండు గంటల వేళ మోటారు లాంచీ కృష్ణానదిని చీల్చుకుంటూ వేగంగా ముందుకు సాగిపోతోంది.

నాగార్జున సాగర్ రిజర్వాయరు మధ్యలో నున్న నాగార్జున కొండను చూడటానికి వెడుతున్న విహార యాత్రికుల సందడి లాంచీ మోతని మింగేస్తోంది. కీచు గొంతుకలు, బొంగురు గొంతుకలు, శ్రావ్యమైన కంఠాలు, రకరకాలవి గాలిలో తేలుతూ వినిపిస్తున్నాయి నిశ్చలంగా వున్న నీళ్ళు — ఆ నీళ్లను ఎటూ పోనివ్వకుండా పట్టి బంధించిన నీలపు కొండలు— ఈ నీళ్ళు, కొండలమీద, పెద్ద షామియానాలా విశాలంగా పరచుకొన్న ఆకాశం.

ఈ అద్భుత దృశ్యాన్ని చూస్తూంటే శ్యామసుందరం మనస్సు సంతోషంతో ఉప్పొంగుతోంది.

ఈ కలరిక లేని వాతావరణంలో కదిలే దిల్హాతాయి ప్రయాణించే లాంచీ మాత్రమే!

ఆలోచనలలో మునిగిపోయిన శ్యామసుందరం లక్ష్మీపతి తన చెవి దగ్గర బిగ్గరగా అరిచిన అరుపుకు మెలుకువలో కొచ్చాడు

"ఏరోయ్ కవీ! అప్పుడే నీ పని మొదలెట్టావా?" లక్ష్మీపతి నవ్వుతున్నాడు.

శ్యామసుందరానికి నవ్వొచ్చింది ఈ లక్ష్మీపతి అంతా వొక్కటే! నవలాకారుడికీ, కథకుడికీ, కవికీ, వ్యాస రచయితకీ వీళ్ల దృష్టిలో భేదంలేదు! అందరూ కవులే! కాస్త వ్యంగ్యంగా కాని గూఢంగా కాని ఎవరేనా మాట్లాడారా వెంటనే వాళ్ళని "నీ కవి హృదయం మాకర్థం కావటంలేదు" అంటూ ఓ కవిని చేసి పారేస్తారు! ఎన్నిసార్లు చెప్పాడో తన మిత్రులకి తాను కథకుణ్ణి కానీ కవిని కానని! వాళ్ళు వింటేనా?

"నా సంగతి సరే! నీ పని యింకా ప్రారంభించలేదా?" ఆలోచనల నుంచి తేరుకున్న శ్యామసుందరం లక్ష్మీపతిని ఎదురు ప్రశ్నించాడు.

"అమ్మమ్మ! సూర్యుడు ఉదయించడమేనా మానవచ్చు కానీ నా పని మానతానా? అదిగో ఆ మూలకు చూడు!" లక్ష్మీపతి కళ్ళతోనే లాంచీలోని వో మూలను చూపించాడు

లక్ష్మీపతి దృష్టిని అనుసరించిన శ్యామసుందరం ఆ వైపుకు చూసి మెచ్చుకుంటూ తల వూపాడు లక్ష్మీపతి ఎప్పుడూ తప్పడు! శ్యామసుందరానికి లక్ష్మీపతితో తన ప్రథమ పరిచయం గుర్తొచ్చింది.

ఓ రోజు తన కెందుకో చాలా ఉత్సాహంగా వుంది సిల్కు లాల్చీ పైజమా వేసుకుని సరదాగా గాలిలో తిరగాలనిపించి, మెల్లిగా రోడ్డు ప్రక్కగా నడుస్తున్నాడు ఇంతలో తన ముందర ఓ స్కూటర్ సడన్ బ్రేక్ వేసుకొని ఆగింది

"నమస్కారం గురువుగారూ! నన్ను లక్ష్మీపతి అంటారు మీరు 'శ్రీ' అనే పేరుతో కథలు రాస్తూంటారని కనిపెట్టేశాను మీ అభిమానుల్లో నేనొకణ్ణి మీరు యీ మధ్య రాసిన వో కథ గురించి మీతో మాట్లాడదామని వచ్చాను" అని అన్నాడు వో యువకుడు స్కూటర్ దిగి!

తనకు అతను పరిచయం చేసుకున్న తీరుకూ, అతని చొరవకూ నవ్వొచ్చింది మాట్లాడుతూంటే లక్ష్మీపతి మొహం చాలా ఆకర్షణీయంగా వుంటుంది కళ్లు నవ్వుతున్నట్టుంటాయి మగవాళ్లలో యిటువంటి ఆకర్షణ చాలా అరుదు అనుకున్నాడు తను

తనూ సరదాగా, ప్రతి నమస్కారం చేసి "రండి మాట్లాడుకుందాం" అంటూ ప్రక్కనే వున్న పార్కులోకి దారి తీశాడు

"నా గురించి మరికొంచెం చెప్పనివ్వండి పేరుకు తగినట్టు లక్ష్మీపుత్రుణ్ణి! హాబీ సౌందర్యారాధన! అలాగని అల్లరి చిల్లరిగా తిరుగుతాననుకోకండి! ఈ మధ్యనే బియ్యే పాసయ్యాను కొన్ని రోజులు పోయాక బిజినెస్‌లో ప్రవేశిస్తా! ఈ లోపల జీవితాన్ని తృప్తిగా అనుభవించాలన్నది నా కోరిక!" లక్ష్మీపతి ఆగి మళ్లీ మొదలు పెట్టాడు

"మీరు మొన్న రాసిన కథలో 'స్వప్నం' అనుకుంటా దాని పేరు! 'మృణాళిని' పద్మనయని, లలో ఎవరు అందమైనవారో తేల్చి చెప్పడం ఎవరితరం కాదు' అని రాశారు మీరు! వాళ్లిద్దర్నీ నాకెదురుగా నిలబెడితే ఎవరు అందమైనవాళ్లో క్షణంలో చెప్పేస్తాను నేను!" అన్నాడు సీరియస్‌గా!

తనకి నవ్వొచ్చింది కథల్లో పాత్రల్ని సృష్టించగలడు తప్ప తను వాటికి ప్రాణం పోసి భూమి మీదకు తీసుకు రాగలడా?

"నవ్వకండి నేను చాలా సీరియస్‌గా చెబుతున్నా! మీరు నా ప్రతిభను గుర్తించకపోతే నాకు తృప్తి లేదు! పోనీ యీ పార్కులో వున్న అమ్మాయిల్లో అందగత్తె ఎవరో మీకు

ప్రారంభం!

చూపించనా ?'' ఛాలెంజ్ చేస్తున్నట్టు చూశాడు తనని లక్ష్మీపతి

సరేనన్నట్టు బుర్రవూపాడుతను అయిదు నిముషాలు గడిచింది. లక్ష్మీపతి తీక్షణంగా పార్కంతా పరిశీలించాడు

''ఆ చెట్టుక్రింద నిలబడిన వాళ్లలో మూడో అమ్మాయిని చూడండి గురువు గారూ'' లక్ష్మీపతి కంఠం హుషారుగా వినిపించి అటు చూశాడు తను. అక్కడ వున్న అమ్మాయి నిజంగానే చాలా అందంగా వుంది కాని ఎంతో అనుభవజ్ఞులు తప్ప కదిలే ఆ సౌందర్య సమూహం నుండి ఒక వ్యక్తిని అలా ఎన్నుకోలేరు !

''కంగ్రాచ్యులేషన్స్ లక్ష్మీపతిగారూ ! మీరే గెలిచారు !'' లక్ష్మీపతి చేతిని ఆప్యాయంగా స్పృశిస్తూ అన్నాడు తను.

''అమ్మయ్య ! మిమ్మల్ని ఒప్పించగలనో లేదో అని తెగ మధన పడ్డాను కవులెప్పుడూ సాధారణంగా తాము రాసింది తప్పని ఒప్పుకోరని చదివానెక్కడో ? మీరు వాళ్ళల్లో అప్పు బుట్టినట్టున్నారు! 'మనోరమ'లో కాఫీ త్రాగి పోదాం పదండి'' అన్నాడు లక్ష్మీపతి

''అవును ! నిజంగానే తప్పు బుట్టాను'' అనుకున్నాడు తనలోతాను !



లక్ష్మీపతి మాట త్రోసివెయ్యలేక కాఫీ తీసుకుని బయటపడ్డాడు. అలా క్రమక్రమంగా పెరిగిన తమ పరిచయం యీ నాటికి బాగా పెరిగి వొకరు ఎక్కడికైనా బయలుదేరితే రెండోవాళ్ళు వాళ్ళని అనుసరించి వెళ్ళేటంత వరకూ వచ్చింది.

తను బౌద్ధ యుగానికి సంబంధించిన వొక చారిత్రక నవలను వ్రాయాలను కొని నాగార్జునకొండను చూడటానికి వెడతానంటే లక్ష్మీపతి తానూ వస్తానన్నాడు. బస్సులో పోదామంటే వొద్దని తన స్కూటర్ మీద తీసుకొచ్చాడు నాగార్జున సాగర్‌కు.

"ఏం చూశావా లేదా ? నా ఎన్నిక ఎలా వుంది ?" అన్న లక్ష్మీపతి మాటల్తో మళ్ళీ ప్రపంచంలో పడ్డాడు. శ్యామసుందరం.

లక్ష్మీపతి చూపిన సౌందర్యవతి అందం శ్యామసుందరం కళ్ళకు మిరుమిట్లు గొల్పింది. ఆమె వేషధారణ, శరీరపు రంగు, అన్నింటి కంటె ఎక్కువగా ఆకర్షించే ఆమె ముఖంలోని పెద్ద పెద్ద కళ్ళు, నవ్వినప్పుడు కనిపించే అందమైన తెల్లని పలువరస, తీరైన కదలికలు, చూడగానే ఆకర్షిస్తాయి. ఆ సౌంద ర్యాన్ని చూసిన వెంటనే మనిషిలోని చిలిపి తనం పోయి ఆ సౌందర్యానికి గౌరవంతో తల వంచి జోహారు చెయ్యాలనిపిస్తుంది.

"ఏం ఇంకా షాక్ నుంచి తేరుకోలేదా?" లక్ష్మీపతి చిలిపిగా నవ్వాడు. శ్యామసుందరం సిగ్గుపడ్డాడు. ఎంతో మంది అసాధారణ సౌందర్యవంతులను తన కథల్లో సృష్టించాడు కాని యీ ప్రత్యక్ష సౌందర్యం ఎంత విలక్షణం!

అటే చూస్తూవుంటే మర్యాదగా వుండ దని చూపు మరల్చుకున్నాడు శ్యామసుందరం. "ఆమెతో యింకో ముగ్గురు ఫ్రెండ్సు కూడా వచ్చినట్లున్నారు. వాళ్ళూ బాగానే వున్నా రనుకో!" లక్ష్మీపతి నవ్వేశాడు.

తన కళ్ళ కొసల నుంచి శ్యామసుందరం వాళ్ళవైపు చూశాడు.

ఆ ముగ్గురు అమ్మాయిల్లోనూ వొకామె తను చూసిన మొదటి సౌందర్యవతి అంత అందంగానూ వున్నా, మనిషిలో వున్న కదలిక, మాటల్లోని తొందరతో, ఆమె కలిగించినంత ఉదాత్త భావాన్ని కలిగించలేక పోయింది. మిగిలిన వాళ్ళిద్దరూ కూడా సగటు ప్రమా ణాలకు అందగత్తెల క్రిందే లెఖ్ఖ!'టీనేజర్సు'

# అతకని అనుబంధాలు

అనచ్చు వాళ్ళని. శ్యామసుందరం వాళ్ళనే పరిశీలనగా చూస్తున్నాడు.

'ఇంక మిగిలిన ప్రయాణీకుల్ని చూడవా?' లక్ష్మీపతి నవ్వాడు !

శ్యామసుందరం గబుక్కున తన చూపు మరల్చుకున్నాడు. కథకుడికేదో విలక్షణమైన దృష్టి వుండాలి, వుంటుంది, అంటారు. నిజానికి తనకంటే లక్ష్మీపతికే ఆ విలక్షణ దృష్టి, పరిశీలనాశక్తీ ఎక్కువగా వున్నాయి.

"నువ్వెందుకు కథలు రాయకూడదు లక్ష్మీపతి?" అంటే "నువ్వురాసేకథలు నాకు బావున్నప్పుడు మళ్లీ నే నెందుకు రాసి శ్రమ పడటం!" అనేవాడు.

"ఆలోచనలు మానేసి శ్రద్ధగా విను" లక్ష్మీపతి హెచ్చరించి తన వ్యాఖ్యానంమొదలు పెట్టాడు.

ఒక సభలో ఉపన్యాసం ఇస్తున్న వాయ కుడుగారు ఒక జోకుతో ముగించబోయి ఆ జోకుని పూర్తి చేయటంలో సరిగ్గా చెప్పలేక పోయారు. ఎవరికీ అర్థం కాలేదు, నవ్వు రాలేదు. కొన్ని క్షణాలు గడిచాయి. ఒకపెద్ద మనిషి మాత్రం విరగబడినవ్వాడు.

"ఎందుకు నవ్వారు ?" పక్కనేకూర్చున్న రామారావు అడిగాడు.

"నవ్వకపోతే మళ్ళీ చెప్తాడండీ !" అన్నాడు పె. ప.

"అదుగో చూడు ! ఆ చివర కూర్చున్న తను, ఈలాంచికి, సీటికి, కొండలకి అన్నింటికీ తానే సర్వాధికారిలా పోజు కొడుతున్నాడు. అతని ప్రక్కనే వున్న మరాఠీ కుటుంబం బొంబాయి సినిమా స్టూడియోలో మేకప్పు లతో బయటకొచ్చిన తారల్లా వున్నారు. ఆ ప్రక్కనే వున్న దంపతుల్ని చూశావా ? 'దోయా తీన్ బచ్చే' అడ్వర్‌టైజ్‌మెంటులా ముచ్చటగా యిద్దరు పిల్లల్తో కూర్చున్నారు. ఫొటో తీసి పంపిస్తే ఫామిలీ ప్లానింగ్ డిపార్టుమెంటు వాళ్ళు బహుమానమిచ్చిన్నా యిస్తారేమో ! అవతలి ప్రక్క అంటుకుపోయి కూర్చున్నవాళ్ళు 'హనీమూన్' కొచ్చిన దంప తులు. 'నీకెలా తెలుసు ?' అనకు ! మొహాలు చూస్తేనే తెలుస్తోంది ఆ సంగతి ! వరే ఆ ప్రక్కనే నాలుగు పందల కోతులు !" లక్ష్మీపతి నవ్వుతున్నాడు.

శ్యామసుందరానికి నవ్వొచ్చింది! ఆ మాటకొస్తే తామిద్దరూ మాత్రం రెండు పందల కోతులు కారూ? 'బ్రహ్మచారీ శత మర్కటః' అన్నసూత్రాన్ని పట్టుకొని వాళ్ళం దర్నీ కోతుల్ని చేసేశాడు లక్ష్మీపతి. హిప్పీ స్టైయిలులో జులపాలు పెంచుకున్నంటురు ఆ పోలిక బాగానే సరిపోయింది వాళ్ళకి. శ్యామ సుందరం నవ్వుకున్నాడు.

"అది సరే! ఇంతకీ కథకుడివి నువ్వా నేనా?" శ్యామ సుందరం ప్రశ్నించాడు.

"ఈ రోజు నేను కథకుడికి కథకుణ్ణి ! సరేనా ?" లక్ష్మీపతి నవ్వుతూ జవాబిచ్చాడు.

లాంచీ వేగం తగ్గుతోంది. నాగార్జున కొండని సమీపిస్తోంది. ఇంజన్ ఆపేశారు. లాంచీని మెల్లిగా రేవులా తయారుచేసిన స్థలం లోకి చేర్చి లంగరు వేశారు. లాంచీ మీదనుంచి నదీ తీరం మీదకు చెక్క బల్లను వేశారు. త్రోసుకుంటూ, నవ్వుకుంటూ, తృప్తి పడుతూ విహార యాత్రీకులంతా గబగబా క్రిందకు దిగారు.

అందరిలోకీ ఆఖరున దిగారు లక్ష్మీపతి, శ్యామసుందరాలు. నదీ తీరంలోని రాళ్ళ మధ్య నుంచి పైకి వో యిరుకైన కాలిబాటవుంది. దానిగుండా పైకిచేరితే అక్కడ తారురోడ్డు వస్తుంది.

కాలిబాటమ్మట పైకి పోతూవుంటే 14, 15 శతాబ్దాలనాటి దేవాలయ రాతిమండపాల శిథిలాలు కనుపిస్తాయి.

తారురోడ్డుచేరి మెల్లిగా నడుస్తున్న లక్ష్మీ పతి, శ్యామసుందరాలకు కొంత దూరంలో ఆగి పోయి తమలో తామేదో చర్చించు కుంటున్న అమ్మాయిలు కనుపించారు. ఆ తారురోడ్డుకు కొంచెం దూరంలో రెండువైపులా శ్రద్ధగా అమర్చిన రాతి ముక్కల గుట్టల్నిచూసి యివి దేనికి సంబంధించిన శిథిలాలో అని చర్చిస్తు న్నారు వాళ్ళు! లక్ష్మీపతికి వాళ్ళవాదనలు విని నవ్వొచ్చింది. నాగార్జున కొండమీద కట్టడాలు నిర్మించేటప్పుడు పునాదులు త్రవ్వినప్పుడు వచ్చిన రాతిముక్కల్ని వొకచోట గుట్టగా పోయకుండా అందంగా స్థూపాల ఆకారంలో పేర్పించారు అక్కడి పురాతత్వ శాస్త్రజ్ఞులు!

"ఒరేయ్ సుందరం చిన్న నాటకమాడనా? వాళ్ళు చూస్తున్నది బుద్ధుని దంతంపై నిర్మించిన మహా విహారమని వో లెక్చరు దంచనా?" చిలిపిగా నవ్వాడు లక్ష్మీపతి.

"తప్పురా పతీ! మొట్టమొదటి సారిగా

యీ కొండ గురించి ఏమీ తెలియకుండా వస్తే నువ్వూ అలాగే భ్రమపడి వుండేవాడివి. అసలు సంగతిని చెప్పరా!'' శ్యామసుందరం జవాబిచ్చాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ" అంటూ లక్ష్మీపతి వాళ్ల దగ్గరకు వెళ్లి అవి కొండమీద త్రవ్వకాల్లో వచ్చిన రాతిముక్కల్ని అందంగా పేర్చిన రాతి గుట్టలు తప్ప పురాతన శిధిలాలు కావని తెలియచెప్పాడు.

అంతవరకూ ఎవరిని ఏమడగాలో, ఏమి చూడాలో తెలియక త ట ప టా యి స్తూ దిక్కులు చూస్తున్న ఆ అమ్మాయిలు బిల బిల్లాడుతూ లక్ష్మీపతి చుట్టూ చేరారు. అసలు వాక్చాతుర్యం వున్న మనిషి! అందులో యువకుడు! అందగాడు! అక్కడ ఆపద్బాంధవుడిలా కనుపించిన లక్ష్మీపతి చుట్టూ ఆడపిల్లలు అలా చేరటంలో ఆశ్చర్యంలేదు అనుకున్నాడు కొంచెం దూరంలో నిలబడిన శ్యామసుందరం.

"మీకు యీ నాగార్జున కొండ, యిక్కడి శిధిలాలు, శిల్పాలు, బాగా పరిచయంలా వుంది. దయచేసి వీటిని గురించి వివరంగా చెప్పండి! ప్లీజ్!'' అమ్మాయిలు లక్ష్మీపతిని ప్రాధేయ పడుతున్నారు.

వాళ్ల ఉత్సాహం, వాళ్ళు తనంటే చూపుతున్న గౌరవానికి లక్ష్మీపతి పొంగి పోయాడు. అందులో ప్రత్యేకంగా చేపకళ్ల సుందరి! చేపల్లాంటి ఆ కళ్లను అటూ యిటూ గమ్మత్తుగా కదిలిస్తూ ఎంత అందంగా లాగిందో తనని! ఆ గర్వంతో అక్కడవున్న ప్రతిచెట్టు, రాయి, పుట్టల కథలన్నీ తనకు తెలుసునని చెప్పేద్దామనుకున్నాడు. కాని తనకు సగం సగం మాత్రమే తెలుసునని గుర్తొచ్చింది!

"నాకు బాగా తెలుసుననుకోండి. కాని నా మిత్రుడు శ్యామసుందరానికి యింకా బాగా తెలుసు. అతను యీ సబ్జెక్టును బాగా స్టడీ చేశాడు. బౌద్ధయుగపు వాతావరణంలో ఆంధ్రదేశపు చ రి త్ర కు సంబంధించిన నౌకనవల రాయాలనుకుంటున్నాడతను." శ్యామసుందరం వైపుకు చూపించి అతన్ని దగ్గరగా రమ్మనమని చెయ్యూపాడు లక్ష్మీపతి.

"అంటే శ్యామసుందరం గారు రచయిత అన్నమాట" అంటూ అమ్మాయి అతనివైపు విప్పారిన కళ్లతో ఆశ్చర్యంగా చూస్తూ అన్నారు.

"వారు ఏంపేరుతో వ్రాస్తూవుంటారు?" తాను చూచిన అద్భుత సౌందర్యవతి చిన్న కంఠంతో అడిగింది లక్ష్మీపతిని.

అంటే యీ అమ్మాయికి సమకాలీన తెలుగు సాహిత్యంతో మంచి పరిచయమే వుందన్నమాట! తన పేరుతో రచనలు కనిపించక పోవటం వల్లనే ఆమె అలా అడిగింది అనుకున్నాడు శ్యామసుందరం.

"'శ్రీ'అనేపేరుతోరాస్తూవుంటాడండి!" లక్ష్మీపతి గర్వంతో హుషారుగా జవాబిచ్చాడు.

"ఓ! ప్రఖ్యాత కథకులు 'శ్రీ' మీరేనా? నమస్కారం!" అంటూ అమ్మాయిలంతా కోరస్‌లో అతనికి నమస్కరించారు.

శ్యామసుందరం అ ప న వ్వు ట్టు తల పంకించి నవ్వుతూ ప్రతి నమస్కారం చేశాడు.

తను నవల రాయడానికి మెటీరియల్ సమకూర్చుకోవటానికి వస్తే యీ ఆడపిల్లలను తగిలించావే అని లక్ష్మీపతి మీద ముందు కోపం వచ్చింది. కాని ఆడపిల్లల మాటల్లో వుట్టిపడే గౌరవం, అక్కడి విషయాలన్నీ తెలుసుకోవాలన్న వాళ్ల కుతూహలం చూసి, అతని కోపం తగ్గింది.

"ముందర మ్యూజియం చూ ద్దా ం పదండి. ముఖ్యమైన శిల్పాలన్నీ మ్యూజియం లోనే భద్రపరిచారు. బయట వున్నవి శిధిలాల నకళ్లు మాత్రమే. ఇవి చూస్తూకూర్చుంటే లోపలి శిల్పాల సౌందర్యాన్ని పరిశీలనగా చూడటానికి కాలం చాలదు! పైగా లాంచీవాళ్లు గంటన్నరలో తిరిగి వచ్చెయ్యమన్నారు కదా!" శ్యామసుందరం ముందుకు దా రి తీ స్తూ అన్నాడు.

"ఇంక నా బాధ్యత తీరిపోయింది! వాడివి అనుసరిస్తే, మీరు యిక్కడినుండి వెళ్లిపోయి ఎక్కడ వున్నా యీ శిల్పాల సంగతి గుర్తుండేలా చెబుతాడు! పదండి పోదాం!" లక్ష్మీపతి చిలిపిగా నవ్వాడు.

ఆ ఆడపిల్లల మాటల్లో శ్యామసుందరం అతి సౌందర్యవతి పేరు సుమిత్ర అని గ్రహించాడు. మిగిలినవాళ్లు వాళ్ల అందం వరుసలో మాయ, కల్పన, కాంచనలు. అంతాక్లాస్‌మేట్స్. హోమ్ సైన్సు కాలేజీలో డిగ్రీకోర్సు చదువుతున్నారు.

వీళ్లందరూ మెల్లిగా మ్యూజియందగ్గరకు చేరేసరికి లాంచీలో సర్వాధికారిలా పోజు కొడుతున్నాడని లక్ష్మీపతి చెప్పిన వ్యక్తి జేబులోంచి పెద్ద తాళం ఒకటితీసి, తనకు నమస్కరించిన అటెండెంట్ చేతికి అందించి హుందాగా నిలబడ్డాడు.

అతనే ఆ మ్యూజియమ్ సంరక్షణాధికారి అని గుర్తించగానే మిగతా యాత్రికులంతా అతన్ని గొప్ప గౌరవంతో చూడ సాగారు. ఏ స్థలంలో ఎవరు అధికారి అయితే అక్కడ వారికి అధిక గౌరవం! ఆ అధికారి క్రీగంటను గిరగా చూస్తున్నాడు. లాంచీ మీదనుంచి అతన్ని నెట్టుకుంటూ ముందుకు త్రోసుకుపోయిన సర్దార్జీ అ త ని వైపుకు భ యం భ యంగా చూస్తున్నాడు.

అతనే అధికారి అని తెలియగానే మిగతా యాత్రికులలో కలిగిన సంచలనాన్ని సరదాగా చూస్తున్న శ్యామసుందరం చెవిలో "వీడు నిజంగానే పెద్ద అధికారోయ్!" అని గుసగుస



# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

ఎం. ఎస్. —ఏలూరు.

నా వయస్సు 17 సం. లు. 2 నెలల క్రితం నాకు జ్వరం వచ్చినది. అది తగ్గిన దగ్గరనుంచీ ముఖం వాపు, కాలి పిడమ దగ్గర వాయటం జరుగుతున్నది. ఇలా రావడానికి కారణమేమిటి ? ఏం చెయ్యాలి?

జ్వరము వచ్చి తగ్గిన తర్వాత శరీరంలో నీరు చేరి అక్కడక్కడా వాపులు రావటం, నెత్తురులో 'హిమోగ్లోబిన్' తగ్గటాన్ని సూచిస్తుంది. మలము పరీక్ష, రక్తపరీక్ష చేయించుకొని, 'అనీమియా' ఉన్నప్పుడు 'ఫెర్సొలేట్' వంటి ఇనుప ధాతువు గల మాత్రలు వాడటం మంచిది.

(హూక్‌వర్మ్స్) మలములో క్రిములు ఉండటం వల్ల అనీమియా వచ్చిందని వైద్యులు నిర్ధారణ చేస్తే దానికి తగినమందులు వైద్యుల సలహా ప్రకారం వాడవలసి ఉంటుంది.

ఎ. ఆర్. —గుడివాడ.

మల విసర్జన చేసినప్పుడు చిన్న చిన్న తెల్లని క్రిములు పడుతున్నవి. పెదవులు కూడా తరచూ పగులుతూ ఉంటాయి. వీటికి నివారణోపాయం ఏమిటి?

చిన్న చిన్న తెల్లని క్రిములు మలములో ఉన్నప్పుడు "ఆక్సియూరియాసిస్" లేక 'త్రెడ్‌వర్మ్స్' అంటారు. వీటిని నిర్మూలించడానికి కుటుంబములోని సభ్యులందరూ ఒకేసారిగా మందు తీసుకోవలసి ఉంటుంది. తిరిగి రాకుండా వ్యక్తిగత జాగ్రత్తలు అంటే మలవిసర్జన సమయంలో పాదరక్షలువాడటం, గోళ్లు కత్తిరించుకోవటం మొదలయినవి తీసుకోవాలి

ఈ పురుగులనిర్మూలనానికి 'పైపరజీన్‌సిట్రేట్' రోజుకి నాలుగు చెంచాల వంతున వరుసగా ఒకవారం రాత్రి పూట తీసుకోవాలి. 8 వ రోజుని విరేచనాలకు వేసుకుంటే మంచిది.

నోటి పగుళ్లకు విటమిన్ 'సి' 'బి కాంప్లెక్స్' మాత్రలు వాడండి.

పి. ఎస్. —కర్నూలు.

నా చెవిలో ఏదో తెల్లగా వుంటున్నది. ఇలా 1 సం. గా వున్నది. చెవి నెప్పి ఎక్కువగాడుంటుంది. ఇయర్ డ్రాప్స్ వాడితే 2, 3 రోజులు మాత్రం లేకుండా వుంటుంది.

చెవులో ఇలా తరచూ తెల్లగా రావటాన్ని 'ఫంగస్' అంటారు. చెవులలోపలి భాగం ఎప్పుడూ పొడిగా వుండేటట్లు చూసుకోవటం, "నియోస్పోరిన్ (డ్రాప్స్)" చెవులలో రోజుకి 2 సార్లు ఒక వారం పాటు వరుసగా వేయటం వల్ల దీనిని నిర్మూలించ వచ్చును. ఈ ఫంగస్‌ను పుల్లలతోగాని లేక ఇతర ఆయుధాలతో గాని కెలకకూడదు.

కె. ఎల్. —రేపల్లె.

నాకు 'బ్లీడింగ్' సరిగా కాదు. విపరీతంగా వళ్లు వస్తున్నది. నెత్తురు లేదన్నారు. వళ్లు తగ్గటానికి ఏం చెయ్యాలి. ?

ప్రతిరోజూ తగినంత పని, విశ్రాంతి, క్రమ పద్ధతిలో ఆహారం తీసుకోవటం వంటి అలవాట్లను అలవరచుకొంటే ఇలా జరగటానికి అవకాశం లేదు.

నెత్తురు పరీక్ష, మల పరీక్ష, మూత్ర పరీక్ష చేయించుకుని ఫలితాలను వైద్యులకు చూపించండి. 'హిమోగ్లోబిన్' నెత్తురులో తగ్గినప్పుడు అలా జరగటానికి కడుపులో క్రిములు లేక శరీరంలో నుంచి నెత్తురు ఎక్కువగా పోవటం లేక ఆహారంలో ఇనుప ధాతువు తక్కువగావుండటము వని ముఖ్య కారణాలవుతాయి. ఏ కారణం వల్ల అలా జరిగిందో వాటికి తగిన చికిత్స చేస్తేగాని 'అనీమియా' పోదు. 'బ్లీడింగ్' కూడా సరిగా కాదు. పైన చెప్పిన విధంగా తగిన పరీక్షలు చేయించుకొని వైద్యసహాయం పొందండి.

---

లాడాడు లక్ష్మీపతి. శ్యామసుందరానికీ నవ్వొచ్చింది.

తలుపులు తీసాక మ్యూజియంలోకి వెళ్లగానే ముందుగా కుడివైపు గోడమీద మ్యూజియం ప్లాను, సంగ్రహంగా, నాగార్జున కొండా, దానివద్ద దొరికిన శిథిలాల గురించిన చరిత్ర వుంది.

ఒక వైపున గాజు పలకలమర్చిన బల్ల మీద నాగార్జునకొండలోని శిథిలాల, శిల్పాల,ఛాయా చిత్రాలు పోస్ట్‌కార్డ్ సైజులో ప్రింటుచేసినవి వున్నాయి. అక్కడే నాగార్జున కొండ అనే పేరుతో భారతీయ పురావస్తుశాఖ (ఆర్కియాలాజికల్ డిపార్టుమెంటు) ప్రచురించిన చిన్న పుస్తకం కూడా అమ్మకానికి వుంది.

విహార యాత్రికులంతా బొమ్మలు, పుస్తకాలు కొనడానికి ఎగబడ్డారు.

అవి అమ్మడానికి నియమించబడిన వ్యక్తి మాత్రం "బొమ్మల సెట్టు రెండు రూపాయలన్నర, పుస్తకం కూడా అంతే రేటు. చిల్లర వున్నవాళ్లకే పుస్తకాలమ్ముతాం!" అంటూ నిశ్చలంగా కూర్చున్నాడు.

జనమంతా మొహాలు చూసుకుంటున్నారు. ఇది ద్వీపం ! ఇక్కడ చిల్లర ఎక్కడ దొరుకుతుంది? చిల్లర కోసం మళ్లీ రైట్ బ్యాంకుకు వెళ్లి రాలేరుకదా ? ఎంతెంత దూరాల నుంచో వచ్చినవాళ్లు నాగార్జున కొండ గురించి తెలిపే బొమ్మలను, పుస్తకాలనేనా కొనుక్కు వెళ్లకపోతే ఎంత ఆశాభంగం పొందుతారో ప్రభుత్వానికి తెలియదా ? శ్యామసుందరం నిట్టూర్చాడు.

చిల్లరవున్న వాళ్లు పుస్తకాలు, బొమ్మలు కొనుక్కుంటున్నారు. లేనివాళ్లు మిగిలినవాళ్ల దగ్గర అప్పు తీసుకుని కొంటున్నారు. శ్యామసుందరంతో వచ్చిన అమ్మాయిలు చిల్లరలేక ఏం చెయ్యాలో తెలీక దిక్కులు చూస్తున్నారు. వాళ్ల మొహాల్లో నిరాశ కనిపిస్తోంది.

లక్ష్మీపతి చొరవగా కౌంటర్ దగ్గరకు వెళ్లాడు పది రూపాయల నోటిచ్చి రెండు బొమ్మల సెట్లను, రెండు పుస్తకాలను కొన్నాడు.

మాయవద్దకు వచ్చి "మీరేమీ అనుకోకపోతే యీ పుస్తకం, బొమ్మల సెట్టును, యీ నూతన మిత్రుడి కానుకగా స్వీకరించండి." అన్నాడు.

మెరిసే కళ్లతో "థాంక్యూ" "థాంక్యూ" అంది మాయ. మిగిలినవాళ్లు కూడా లక్ష్మీ

## అతకని అనుబంధాలు

పతికి కృతజ్ఞతలు తెలిపి బొమ్మలు చూడటంలో నిమగ్నమై పోయారు.

"చూశావుగా సుందరం, డబ్బు వొక్కొక్కప్పుడు ఎంత ఉపయోగపడుతుందో ! మన్నీసమయంలో ఏంచేసినా వాళ్లు కృతజ్ఞతని పొందలేవు !" అన్నాడు లక్ష్మీపతి మెల్లిగా శ్యామసుందరం చెవిలో. శ్యామసుందరం నిజమేనన్నట్టు నవ్వాడు.

మెల్లగా నడిచి అంతా విశాలమైన హాల్లోకి వెళ్లారు. చక్కగా కట్టిన అందమైన బిల్డింగ్ మ్యూజియం. బయటనుండి చూస్తే ఎత్తు ఎక్కువ వున్నట్టు కనిపించదు దాని లోపల చాలా ఎత్తైనది. గుండ్రని పెద్ద స్తంభాల ఆధారంమీద నిలబడింది పైకప్పు. విశాలమైన హాల్లో ఆ స్తంభాలు అదో వింత అందాన్ని సమకూర్చాయి. పెద్ద ఎక్కువగా లేని వెలుతురు భవన వైశాల్యం, శిల్పాల్ని అమర్చినతీరు అన్నీ కలిసి, మనని మరో ప్రపంచంలోకి తీసుకుపోతాయి.

వరుసగా అమర్చిన శిలాఫలకాల దృశ్యాల్ని శ్రద్ధగా పరిశీలిస్తూ ముందుకు సాగిపోతు

## డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

**వి. ఎల్. పి. —విజయవాడ.**

రాత్రి కలలు వచ్చినప్పుడు సినిమాలలో 'సెక్స్' సీనులు చూచిన రోజున శుక్లనష్టము జరుగుచున్నవి. నా వయస్సు 19 సంవత్సరములు ఇలా జరుగకుండా ఉండాలంటే ఏం చేయాలి?

యుక్త వయస్సు వచ్చిన వారిలో వీర్య ఉత్పత్తి ప్రకృతి సిద్ధంగా ఎక్కువగా ఉంటుంది. ఆ వయస్సులో స్త్రీ— పురుష పరస్పరాకర్షణ శక్తి సహజంగా ఉంటుంది. ఎదుటి వారిని గురించి, జననేంద్రియాలను గురించి తెలుసుకోవాలనుకోవటం, అనుభవించాలనుకోవటం— వీటి కోసం ,పుస్తకాలు సినిమాలు చూసి ఉద్రేకం పొందటం వల్ల ఇలా జరుగుతుంది. దీనివల్ల శరీరానికి ఏ బాధా కలుగదు. ఏదో నష్టపోతున్నామని అనేది కేవలం వ్యక్తుల భ్రమ మాత్రమే దీనికి ప్రత్యేకించి వైద్యం అవసరం లేదు.

**బి. ఆర్. ఎం. —విశాఖపట్నం.**

నాకు కొద్ది సం. లుగా సిగరెట్లు కాల్చే అలవాటు ఉన్నది . క్రింద పెదవి మధ్యన ఎర్రగా తయారయినది. చూచేందుకు అసహ్యంగా ఉన్నది. దీని నివారణకు ఏదైనా ఇంజక్షను గాని మందు గాని చెప్పండి.

సిగరెట్లు కాల్చటం వల్ల అలా అయింది అని తెలిసి కూడా మానలేను అని వ్రాయటం వల్ల, మీకు దాని నివారణకు అంత శ్రద్ధ చూపలేరని అనుకోవలసి వస్తుంది.

ఏ మందులు వాడినా తిరిగి సిగరెట్లు కాలిస్తే ఇలా పుండులాగా రాకుండా ఉండదు.

పెదిమల మధ్య ఒకే . పొజిషన్‌లో సిగరెట్లు కాల్చటం వల్ల ఇలా రావచ్చును. అంతగా సిగరెట్లు మానలేక పోతే,తరచూ నోట్లో 'సిట్రవైట్'మాత్రలు ఉంచుకోండి. ఏదైనా వ్యాపకం పెట్టుకుంటే క్రమంగా మానగలుగుతారు.

**జి. ఆర్. —విజయనగరం.**

నా వయస్సు 21 సం. లు. 5 సం. లుగా నాకు చాలా నీరసంగా ఉన్నది. మంచి టానిక్ చెప్తారని ఆశిస్తున్నాను.

నీరసం చాలా కారణాల వల్ల రావచ్చును. ముఖ్యంగా పోషకపదార్థాల లోపం, జీర్ణకోశంలో మార్పులు, అనీమియా, మలంలో క్రిములు ఉండటం ఇలా ఉండడానికి ముఖ్య కారణాలు.

మలపరీక్ష, నెత్తురు పరీక్ష చేయించుకొని, తగిన మందులు వాడాలి. ప్రొటీనులు ఎక్కువగా గల ఆహారపదార్థాలు, మంచి పాలు , తగినంత వ్యాయామము చాలా అవసరం.

'టానిక్'ల వల్ల ఎన్ని రోజులు గడుపగలరు. టానిక్‌లకు ఖర్చుపెట్టే డబ్బు మంచి ఆహారానికి ఖర్చుపెడితే ఎన్నో విధాలుగా మంచిది.

**ఎస్. —హైదరాబాద్.**

నా అరచేతులు తెల్లగా పాలిపోయినట్లు ఉంటాయి. కాలి మడమలు పగులుతూ ఉంటాయి' అవికూడా తెల్లగా ఉంటాయి.

శరీరంలో 'హిమోగ్లోబిన్' తగ్గటంవల్ల నెత్తురు సరిగా ఉండదు. దీనిని 'అనీమియా' అంటారు. కాళ్ళు పగలటం నెత్తురు పరీక్ష చేయించుకుని తగిన వైద్యం చేయించుకోవాలి. మలపరీక్ష చెయ్యటం వల్ల కడుపులో నెత్తురు పీల్చే క్రిములు (హుక్ వర్మ్స్) ఉన్నవా,లేదా అని తెలుస్తుంది. ఈ క్రిములు ఉన్నప్పుడు "టెట్రాక్లోర్ ఎతిలిన్" అనే మందు వైద్యుల సలహామీద వాడవలసి ఉంటుంది.

నెత్తురు లేమికి ఇనుప ధాతువు గల మాత్రలు (ఫెర్సొలేట్) వాడాలి.

---

న్నాడు శ్యామసుందరం. అతని మనసులో ఆలోచనలు పందెపు గుర్రాల్లా పరుగెత్తుతున్నాయి. ఈ సున్నపురాతిపై చెక్కిన యీ బొమ్మలు దాదాపు రెండువేల యేండ్లు గడచినా ఎంత సజీవంగా వున్నాయో! వీటిని ఎన్ని సార్లు చూసినా తనివి తీరదు. ఈ ఉజ్వల శిల్పాలను చెక్కిన నాటి ఆంధ్ర దేశపు ప్రజల భాష, ఆ ప్రజల రూపురేఖలు, వస్త్రధారణ, సవివరమైన చరిత్ర తెలియక పోవటం ఆంధ్రుల దౌర్భాగ్యం! తెలిస్తే ఎంత బావుండును.

తను ఎక్కడో దేవానాంప్రియుడు, ప్రియదర్శి అయిన అశోకుడు బౌద్ధ ధర్మ ప్రచారానికి నడుంకట్టి దేశ, దేశాలకు బౌద్ధ ప్రచారకుల్ని పంపటానికిముందే ఆంధ్ర దేశంలో బౌద్ధ స్తూపాలు విహారాలు వున్నాయని అవి బుద్ధుని అస్థికలపైనే నిర్మించబడ్డాయని చదివాడు.

అదే నిజమైతే ఆంధ్రులు అశోకునికి ముందే బౌద్ధ ధర్మాన్ని ఆదరించారంటే వారి ప్రగతి శీలత బయటపడుతోంది. కాని ఆంధ్రులకు వున్న బలహీనతల్లా క్రొత్తను ఎంత తొందరగా ఆదరిస్తారో, అంత తొందరగానూ మరచిపోవటం!

బౌద్ధాన్ని ఆదరించిన కాలంలోనే జైనాన్ని కూడా ఆదరించారు ఆనాటి ఆంధ్రులు. బౌద్ధం భారతదేశం మొత్తం మీదే నశించినా, జైనమేనా కొన్ని రాష్ట్రాల్లో మిగిలింది! ఆంధ్ర దేశంలో ఆ కొంచెంకూడా మిగలలేదు! ఎందుకనో ?

బౌద్ధస్తూప,చైత్య, విహార, నిర్మాణాల్లో అత్యంత శ్రద్ధచూపించి, బౌద్ధంలోని మహాయాన శాఖకు పరమ ప్రామాణిక గ్రంథాలను రచించిన ఆచార్య నాగార్జునుడు నివశించిన యీ పుణ్య భూమిలో వున్న, ప్రజల భాష, గ్రంథాలు, చరిత్ర ఏమీ వివరంగా తెలియక పోవటం ఆంధ్రదేశ చరిత్రలో అత్యంత విషాద ఘట్టం! ఎంత బాధపడీ ప్రయోజనంలేదు దాన్నిగురించి ! రాజభాషగా గౌరవాన్ని పొంది, బౌద్ధమత గ్రంథాలను రచించటానికి ఉపయోగపడి, ఆ గ్రంధాలు చీనా, టిబెట్ మొదలైన దేశాల్లో ఆంధ్ర ప్రశస్తిని చాటడానికి ఉపయోగపడిన ఆనాటి ప్రజాభాష ప్రాకృతం, ఆంధ్రదేశంలో నశించి మరో వెయ్యేండ్లకు తెనుగు అని పేరున్న ఆంధ్ర భాషలో సరిక్రొత్తగా గ్రంధాలు రచించుకోవలసి రావటం ఎంత విచిత్రం!

ఈ నాగార్జున కొండ శిల్పాలన్నింటిలోనూ వొక విధమైన లాలిత్యం, చైతన్యం కనిపిస్తుంది. ఇవి మిగిలిన ప్రదేశాల శిల్పాలకు అనుకరణలు కావు. ఆంధ్ర దేశపు సహజాతాలు ! అమరావతి శిల్పాలతో పోలికలు ఉంటాయి.

సాధారణంగా శిల్పులు, చిత్రకారులు తాముఉన్న ప్రదేశంలోని స్త్రీ పురుషుల రూపాలనే తమ శిల్పాలలో, చిత్రాలలో ప్రతిబింబింప చేస్తారు. తమ మనసులోని ఆదర్శ రూపాలను కూడా చిత్రించవచ్చుగాక! కాని ఎక్కువభాగం తోటి మనుషుల ఆకారాలు వచ్చేస్తాయి !

ఈ శిల్పాలలోని రూపాల ప్రకారం ఆనాటి ఆంధ్రులు చాలా అందంగా వుండి వుండాలి. ఒక మహానాగరిక సాంప్రదాయంలో మెలుగుతున్న వాళ్లయి వుండాలి.

ఏదైనా వొక అద్భుతశక్తి ఆనాటి కాలాన్ని మన కళ్లముందుంచ గలిగితే ఆ ఉజ్వల కాలాన్ని చూసి మనసు పులకరించని ఆంధ్రు డుంటాడా ?

(ఇంకా ఉంది).

# అనగనగా ఓ సుబ్బారావు కథ

శుమైత్రాంగి



అందరి జీవితాలూ కథల్లా జరుగవు, ఏకొందరి కోగాని. ఆ కొందరి లాంటివాడే సుబ్బారావు. చెప్పుకునేవారి కతని జీవితం వో పెద్ద కథేను.

అతను పుట్టింది చదువూ సంధ్యాలేని వో పేద కుటుంబములో, అదీ వో రైతు కుటుంబమేను.

సుబ్బారావు తండ్రి ఇద్దరన్నయ్యలు అక్షరమంటే ఏమిటో తెలియని అజ్ఞానులు. ఒళ్లు పులిసేలా పనులు చేయడమూ, ఒళ్ళు మరచి నిద్ర పోవడమూ ఇదే వారి దిన చర్య, అటువంటి ఇంట తప్పపుట్టాడు సుబ్బారావు.

తల్లి అన్నంపెట్టి "వెళ్ళి గేదెను మేలేయి" అని చెప్పిపంపిస్తే, తిన్నగా బడిలోకెళ్ళి కూర్చునేవాడు సుబ్బారావు. ఎవరిదన్నా విరిగి పోయిన పలక వుంటే అది తీసుకుని టీచరు చేత అక్షరాల్ని రాయించుకుని శ్రద్ధగా వోపిగ్గా దిద్దుకునేవాడు. అలా మొదలయ్యింది అతని చదువు. ఐదుబళ్ళా గుణింతాలు అన్నీ అభ్యసించాక సుబ్బారావుకి పెద్ద చిక్కొచ్చిపడింది. అదేనిటంటే బడిలో టీచ రోజూ చెప్పేవాడు "పుస్తకం కొనుక్కున్నావా లేదా ? ఎందుకని? వెళ్ళి డబ్బులు తీసుకురా తెప్పిస్తాను"అని విరుచుకు పడేవాడు.

ఆ మాటకు సమాధానం చెప్పకుండా వేల చూపులతో బిక్కుబిక్కుమంటూ నిలబడిపోయేవాడు సుబ్బారావు. ఆ టీచరుకి సుబ్బారావు ఇంటి పరిస్థితి ఎలా తెలుస్తుంది.? చదువుకి వాళ్ళ కుటుంబానికి పడదని . . .కోపం పట్టలేక టీచరు ఒక్కటి అంటించేవాడు. "మా నాన్న. . .మానాన్న . . . . ."అంటూ తర్వాత మాట ఏడుపులోకలిసిపోయి వినిపించేదికాదు. ప్రశిడెంటుగారబ్బాయి క్రిష్ణకు, సుబ్బారావుకి మంచిస్నేహం. సుబ్బారావు ఏడుస్తుంటే గబుక్కున తన పుస్తకం ఆ అబ్బాయి చేతిలో కుక్కి "ఇది చూపెట్టు మాస్టారికి" అని బోధించేవాడు క్రిష్ణ. అలా రెండు మూడుక్లాసుల వరకూ క్రిష్ణ పుస్తకాలే ఉపయోగించుకున్నాడు సుబ్బారావు.

క్రిష్ణ వాళ్ళ అమ్మమ్మగారి వూరికి వెళ్ళిపోవడంతోనే సుబ్బారావు సంగతి మళ్ళీ మొదటికొచ్చింది.

"పుస్తకాలు కొనుక్కుంటాను డబ్బులియ్యి నాన్నా"అని తండ్రిని అడుగుతే అతను ఉరిమి చూస్తూ పుత్తకాలా నీసొద్దు వా పొలం పద, లంక లేద్దువుగాని"అన్నాడు. బిక్కమొహంవేసుకునినిల్చున్న కొడుకుని చూస్తూ కరిగిపోయినతల్లి "ఆడుసదూకోవాలని ముచ్చటపడుతున్నాడు పోనీ సదుకోనియరాదా, మునసీబుగారబ్బాయిలా మన సుబ్బడుకూడా ఉద్యోగం చేస్తాడేమో"అంది.

"నువ్వూరుకోయే, సదువంటె మాటలా, పుత్తకాలు, బట్టలు, కలాలు, పెనిసిళ్ళు ఎన్ని కావాలను కున్నావూ? అయ్యన్నీ కొనడానికి మన దగ్గర డబ్బు లేవీ?"ఇదీ ఆ తండ్రి అభిప్రాయం.

సుబ్బారావు హెడ్ మాస్టారితో తన ఇంటి పరిస్థితి చెప్పుకున్నాడు. ఏడుస్తూ.

ఆ మాస్టారిది చాలా మంచి మనసు "నీకెందుకూ నువ్వు చదువుకో పుస్తకాల సంగతి నేను చూసు కుంటాను గాని"అని భరోసా ఇచ్చాడు.

హెడ్ మాస్టారు సహాయంతో సుబ్బారావు చదువు ఏడవ తరగతి వరకూ నిరాఘాటంగా సాగిపోయింది. ఏ ఒడిదుడుకులు లేకుండా.

ఆ వూరి స్కూల్లో ఏడవ తరగతి వరకే వుంది. ఇంకా పైకి చదవాలనుకునేవారు సమీపంలో వున్న టవునుకెళ్ళి చదువుకోవాలి.

సుబ్బారావుకైతే ఇంకా చదువుకోవాలని వుంది కాని తండ్రి ఈసారి సుబ్బారావు చదువుకిససేమిరా ఒప్పుకోలేదు. పైగా అతని ఇద్దరన్నయ్యలూ కూడా "ఆడు సదువు ఒంకతో సుఖపడిపోతుంటే మేమేనా అంత చెడిపోయింది"అంటూ సాధింపు మొదలు పెట్టారు. దీనివల్ల కొంత అతని చదువుకి ఫులుస్టాప్ పడిపోయింది.

కాని హెడ్‌మాస్టారు సుబ్బారావుకి ధైర్యాన్నివ్వడానికో లేక మరెందుకో "స్కూల్లోచేరి చదువుకోలేక పోతే ప్రైవేటుగా చదివి పరీక్షలు పాసు కావచ్చు. నీకు వీలైనప్పుడు నా దగ్గరకొచ్చి చదువుకుంటూవుండు మెట్రిక్ పరీక్షకు కూర్చుందువు గాని" అంటూ వోదార్చాడు. కాని సుబ్బారావు కోరిక అప్పుడూ తీరలేదు. కారణం? హెడ్ మాస్టారిని మరోవూరికి బదిలీ చేసారు. అందువల్ల గత్యంతరం లేక చదువుకి గుడ్‌బై చెప్పాల్సివచ్చింది సుబ్బారావు.

తనతోకలిసి చదువుకున్న గోపీ, రాము, వేణు, సూర్యం వగైరాలు టవునుకెళ్ళి చదువుకొనసాగించు కుంటుంటే సుబ్బారావు మనసు కుమిలిపోయేది అమ్మా నాన్న చదువులేనివాళ్ళు గనకే తనని చదివించలేక పోతున్నారని, తనలోని తృష్ణను తీర్చలేకపోతున్నారని వాపోయేవాడు.

వో రోజు పని మీద టవునుకెళ్ళి వచ్చి సుబ్బారావు తండ్రి "నీకు నౌకరీ కుదిర్చానురా అబ్బీ నువ్వు జాగ్రత్తగా నమ్మకంగా అణకువగా వుంటే జీతం కూడా పెంచుతానన్నాడాయన" అన్నాడు ఉత్సాహంగా.

అప్పటికి సుబ్బారావు వయస్సు పన్నెండేళ్లే 'నాకునౌకరీచూసావా? ఎక్కడా?'' అని ఎంతో ఉత్సాహంగా అడిగాడు. భార్య కూడా వచ్చి దగ్గిరనిల్చుంది. భర్త చెప్పబోయే విశేషం వినడానికి.

మనవూరినుంచి వెళ్ళి టవునులో మకాం పెట్టి వ్యాపారం చేసుకుంటున్న వెంకట్రావుగార్కి కాస్త రాయనూ చదవనూ వచ్చిన కుర్రాడు కావాలంట ఇంట్లోనమ్మకంగా పని చేయాలంట, ఎవర్ని పెట్టుకున్నా మోసంచేసి పోతున్నారని ఆయన గోలెడుతుంటే నేనే మన సుబ్బిగాడి గురించి చెప్పాను.ఆయన ఎగిరి గంతేసినంత పని చేస్తూ "ఇంకేం ఈ రోజే వాడిని పంపించు" అంటూ కూర్చున్నాడు."రేపొద్దున పంపిస్తానని చెప్పి చక్కా వచ్చాను"ఆతను అక్కడ జరిగిందంతా వివరించాడు. "అక్కడ ఏమేమి పనులు చేయాలో, వాడివల్ల అవుతుందా"అని మూలిగింది తల్లి.

అక్కడికి వెళ్ళడానికి సుబ్బారావుకీ ఇష్టం లేదు కాని ఏం చేస్తాడు ? తండ్రి మాటని కాదనే శక్తి లేదు. అందుకే తనకున్న రెండు జతల బట్టలు సంచిలో కుక్కుకుని బైలుదేరాడు సుబ్బారావు. తల్లి తండ్రి కొడుకేదో పెద్ద ఉద్యోగానికి వెళ్తున్నాడు అని మురిసిపోతూ సాగనంపుతుంటె.

పొద్దున్నే లేవడం, పిండిన పాలను హోటళ్లకు సప్లయి చేయడం, బజారు నుంచి కూరగాయలు తేవడం, అప్పుడప్పుడు ధాన్యం పట్టుకెళ్ళి ఆడించుకు రావడం, బియ్యం, పప్పులువగైరా మర పట్టించుకు రావడం, ఇంట్లో ఎప్పుడన్నా పనిమనిషి రాకపోతే నీళ్ళుపట్టి తొట్టెలునింపడం ఏడ్చే చిన్న పిల్లల్ని ఆడించడమూ ఇదీ అతని దిన చర్య. ఆ ఇంట్లో చదువుకుంటున్న పిల్లల్ని చూసి అలా తను కూడా చదువుకోనందుకు తెగబాధపడిపోయేవాడు. ఆ పిల్లలు ఖాళీ సమయములో చదువుకోవడానికి పిల్లల కదల పుస్తకాలు, వారపత్రికలు వగైరాలన్నీ కొంటుంటాడు ఇంటియజమాని. ఆ పుస్తకాలు ఎక్కడబడితే అక్కడ వుండేవి. అవన్నీ వో దగ్గిర ఒబ్బిడిగా పేర్చి తనకి వీలైనప్పుడల్లా చదువుకుంటుండేవాడు సుబ్బారావు. అతను చదివే పుస్తకాల్లో ఎన్నో సంగతులు, మంచి మంచి కథలు, కబుర్లు, విశేషాలు వుండేవి. అవన్నీ చదువుంటే తనుకూడా అలా రాయగలడా? రాసి పంపిస్తే పత్రికల వారు ప్రచురిస్తారా? ఇలా ఎన్నో ఆలోచన్లు, మరెన్నో సందేహాలు అతని మస్తిష్కాన్ని కుమ్మరి పురుగులా దొలిచేవి. ఉత్సుకతను ఆపుకోలేక తన కొచ్చే ఆలోచన్లను పేర్చి కథలుగా, వ్యాసాలుగా రాసి పత్రికలకు పంపించసాగాడు సుబ్బారావు.

మొట్టమొదటిసారిగా తన కథ పడిన పత్రిక చూసుకుని అమితంగా సంతోషపడ్డాడు. తన సంతోషాన్ని ఎవరికన్నా చెప్పుకుంటేగాని నిలువలేననిపించిందతనికి, కాని ఎవరితో చెప్పుకుంటాడు ? అమ్మానాన్నలకు, అన్నయ్యలకు అక్కచెల్లెళ్లకు ఎవరికీ చదువురాదు, ఇక పుస్తకాల్లోని కథల గురించి వాళ్ళకేం తెలుస్తుంది? తననెంకేం ప్రశంసిస్తారు. అక్కడికీ ఉత్సాహం పట్టలేక తన కథ పడిన పత్రిక తీసుకెళ్ళి తల్లికి, చెల్లెళ్ళకుచూపెట్టాడు. వాళ్ళు తెల్ల మొహాలేసి "కథ రాశావా? ఏంకథ మాకు చెప్పు వింటాము"అన్నారు.

"ఇటువంటి వాళ్ళ దగ్గర చెప్పడం నాదే పొరపాటు"అనుకున్న సుబ్బారావు తను రాసే కథల గురించి ఇంకెప్పుడూ చెప్పలేదు వాళ్ళ దగ్గర.

వో రోజు మధ్యాహ్నం అతను శనగపిండి తీసుకు రావడానికి బజారుకి వెళ్ళబోతుంటే గుమ్మంలో ఎదురొచ్చిన పోస్టుమాన్ "ఈ ఇంట్లో సుబ్బారావు పేరుగల వాళ్ళున్నారా?' అంటూ అడిగాడు.

"నా పేరే సుబ్బారావు, దేనికి?"అని ఎదురు ప్రశ్న వేసాడు సుబ్బారావు.

"నీకు పత్రికవాళ్ళు డబ్బు పంపించారోయ్. ఇక్కడ సంతకం చేయి"అంటూ అతను మనియార్డర్ ఫారమ్ మీద సంతకం పెట్టించుకుని డబ్బు యిచ్చి వెళ్ళిపోయాడు. సుబ్బారావు ఆశ్చర్యాన్నుంచి తేరుకోక ముందే.

"నీకు డబ్బొచ్చిందా? ఎక్కడ నుంచీ? నువ్వు కథలు కూడా వ్రాస్తావన్నమాట"ఇలా నలుగురూ అడుగుతుంటే తనని కదా నలుగురూ ప్రశంసిస్తున్నారు అనే భావంతో సుబ్బారావు ఉక్కిరి బిక్కిరి అయిపోయాడు ఆనందం పట్టలేక.

యజమానురాలైతే నిర్లక్ష్యంగా చూస్తూ "నీకేం వచ్చని, నువ్వేం చదివావని రాస్తున్నావు? బహుశా వాళ్ళకి ఎవరూ పంపించడంలేదేమో అందుకే నీ కథలు వేసుకుంటున్నారు"అని హేళన చేస్తుంటే సుబ్బారావు చాలా సిగ్గుపడ్డాడు. చదువుకి కథలకు సంబంధం ఏవిటి?"అని ప్రశ్నించుకున్నాడు తనని తను. 'నేను ఏం చదువుకున్నానని?నాకేం అనుభవం వుందని కథలు వ్రాయడానికి సిద్ధపడ్డాను'అని లోలోపల చాలా మానసిక వేదనను అనుభవించాడు. కాని కొందరైతే అతన్ని ఆకాశానికి ఎత్తేసారు. 'వయసు చిన్నదే అయినా చాలా బాగా వ్రాసావోయ్, ఇంకా కృషి చేస్తే మరింత మంచి కథలు వ్రాయగలవుసుమా'అని ప్రోత్సాహం కూడా ఇచ్చారు.

సిటీలో ఉండి చదువుకుంటున్న యజమాని గారబ్బాయి వచ్చాడు సెలవులకి. అతనిపేరు వెంకటపతి. మనిషిచూట్టానికి చాలా అందంగా వుంటాడు. సైగా సరదాగా వుంటాడు. అందుకనే సుబ్బారావుని మొదటి చూపుతోనే ఆకర్షించుకున్నాడు.

అతను సిటీలో జరిగే వింతలు, విశేషాలు కథల్లా వర్ణించి చెప్తుంటే గంటల తరబడి వింటూ ఆనందించేవాడు సుబ్బారావు.

వో రోజు వెంకటపతి అడిగాడు "ఎంతవరకు చదువుకున్నావూ?"అని. మొదట చెప్పడానికి బిడియపడ్డాడు సుబ్బారావు. అతను పదే పదే అడుగుతుంటే ఇక తప్పని సరియై చెప్పాడు. తను సెవంత్ క్లాస్ వరకూ చదువుకున్నట్లు. "వ అంతేనా? పైకెందుకు చదువుకోలేదూ? మీ వాళ్ళు చదివించలేదా? ఆ సంగతి తెలుస్తూనే వుందిగాని. రోజూ రాత్రిపూట నీకు చదువు చెప్తాను వా దగ్గరే పడుకో"అని ఆర్డరిచ్చాడు అతను.

అంతకన్నా భాగ్యమా అనుకున్న సుబ్బారావు తన మకాంని వెంకటపతి గదిలోకి మార్చుకున్నాడు.

నాలుగైదు రోజుల వరకూ శ్రద్ధగానే చెప్పాడు చదువు. అక్కడ నుంచి చెప్పేచదువు తక్కువ, కబుర్లు ఎక్కువాఅయ్యాయి. పగలంతా గొడ్డులావడినిద్రపోయే వెంకటపతిఅర్ధరాత్రివరకూ మేలుకునేవుండేవాడు. తను మెలుకువగా ఉన్నంత సేపు సుబ్బారావుని నిద్రపోనిచ్చేవాడు కాదు.

పగలంతా రెస్టు లేకుండా ఆ పని, ఈ పని చేసినా రాత్రి తొమ్మిది దాటితే హాయిగా నిద్ర పోయేవాడు సుబ్బారావు. కాని ఇప్పుడు కంటినిండా నిద్రకే మొహంవాచిపోయాడు. నాకు చదువక్కర్లేదు మహాప్రభో అని దణ్ణంపెట్టి తప్పుకోవాలని వుంది కాని యాజమాని తర్వాత యజమానిఅంతటివాడికి ఎలా చెప్పగలడూ? అందుకే అతనెప్పుడు వెళ్ళిపోతాడా అని ఎదురు చూడసాగాడు.

వో రోజు రాత్రి వెంకటపతి సుబ్బారావుతో "నీకు ఒక పని అప్పజెప్తాను అది దిగ్విజయంగా చేసుకు రాగలవా?"అని అడిగాడు.

"వో ఎందుకు చేయనూ?" ఉషారుగా నవ్వేడు

---

"త్వరలోనే భారతదేశం రాష్ట్రపతి గిరి రిటయిరు అవుతారు. ఆయన భారీ మనిషి, ఒకప్పుడు ఉన్నంత చురుకుగాలేరు. (ఇటీవల భూటాన్‌రాజు) సింహాసనారోహణ వేడుకలకి ఆయన వెళ్లినప్పుడు ఆయన తింపూ యొక్క తాషిసోజాంగ్ మెట్లు ఎలాగ ఎక్కుతారన్న సమస్య ఉద్భవించింది. (ఆయన ఆ మెట్లు ఎక్కి) సింహాసనారోహణ జరిగే గదిలోకి వెళ్లాలి. (శ్రీ గిరిని) పల్లకీ లేక సెడాన్ కుర్చీలో ఎక్కించి నలుగురు బలవంతులయిన భూటానీల చేత మోయించవచ్చుననుకున్నారు.

రిహార్సలు భూటాన్ దేశీయాంగ మంత్రి చేత చేయించవచ్చునని ఆయన అంత సమ్మతంగా లేక పోయినప్పటికీ ఒప్పించారు. నగంలో పల్లకీ చలించింది. దేశీయాంగ మంత్రి వయ్యారంగా కాక (మరొక విధంగా) మెట్ల మీద పడ్డారు. ఆయన (ఈ సంఘటన ఫలితంగా) సంతోషించలేదు.

"ఫార్ ఈస్టర్న్ ఎకనామిక్ రెవ్యూ" పత్రిక నుంచి ఆగ్నయుసర్ పత్రిక ఉదాహరణ.

సుబ్బారావు. అతను ఆలోచన ఇంతరాత్రి పూట ఓ సిగరెట్టో తెమ్మంటాడు ఆ మాత్రం తేలేనా'అనే ధీమాతో.

"అంత కష్టమైన పని కాదనుకో ఈ కాగితం మడత ఎదురింటి మేడలోని అమ్మాయికి నైపుణ్యంగా అందించి రావాలి తెలిసిందా? ఇది గాని సాధించుకొచ్చావా నీకు మాంచి పెన్నుకొనిపెట్టాను తెలుసా"అన్నాడు వెంకటపతి లంచం ఆశ చూపిస్తూ,

మంచిపెన్ను అనగానే ఆశ కలిగింది సుబ్బారావుకి. కాగితం మడతేగా యివ్వడం....దీనిలో ఏం తప్పుంది. అనుకున్న సుబ్బారావు వెంకటపతిఅందించిన కాగితం మడత తీసుకుని వెనకాల్నుంచి వెంకటపతి జాగ్రత్త అంటున్నా వినిపించుకోకుండా ఎదిరింటి మేడలోకి పరుగెత్తాడు.

ఆ మేడలోవారికి వో బుల్లికుక్కవుంది. అది చూపులకి చిన్నదిగా కనిపించినా దాని నోరు మాత్రం చాలాదూరం వెళ్తుంది. వినిపిస్తుంది. కుక్కన్నా దాని అరుపన్నా సుబ్బారావుకు చచ్చేంతభయం. అతను పిల్లిలా నడుస్తూ లోపలికి వెల్తుంటే కుక్క "భవు" అంది. అంతే సుబ్బారావు ఎటూచూడకుండా పరుగెత్తాడు. కంగారులో వీధిలోకిపోబోయి పెరట్లోకి పరుగెత్తాడు. ఎవరో "దొంగ, దొంగ" అని అరుస్తూ వచ్చి సుబ్బారావుని వాటేసుకున్నాడు ఎటూ వదలకుండా.

# అనగనగా వో సుబ్బారావుకథ

ఇంట్లో జనం అతనిచుట్టూ చేరారు. తలో దెబ్బా, తలో మొట్టికాయ వేసారు. "నేను దొంగను కాను బాబోయ్, వెంకట్రావు గారింట్లో మనిషిని" అని అరిచి చెప్తున్నా ఎవరూ వినిపించుకోలేదు.

"దొరికాడు కాబట్టి దొంగను కాదంటున్నాడు. ఎవరూ చూడకపోతే ఏదో ఒకటి ఎత్తుకుపోను"అని రకరకాల మాటలు గుంపులోంచి వినిపిస్తున్నాయి. 'నే నెవరో మీ అమ్మాయి నడగండి' అనాలనుకున్నాడు సుబ్బారావు. కాని ఆ మాటవల్ల ఎంతనర్థం జరుగుతుందో ఆ మాత్రం తెలియనివాడుకాదు. అందుకే అన్ని దెబ్బలూ భరించి సిగ్గుతో ప్రాణం చచ్చి ఇవతలి పడ్డాడు.

ఇంట్లోకొస్తే "ఆ మేడ మీదకెందుకెళ్ళావు? నీకూ వాళ్ళకూ సంబంధం ఏవిటి? వాళ్ళపనివాళ్ళతో లాలూచీఅయ్యి ఇంట్లోవి ఎత్తుకెళ్ళి అందిస్తున్నావా?"అంటూ విరుచుకు పడ్డారా యజమాని, యజమానురాలూను. వాళ్ళకీ వాళ్ళకీ ఎప్పటినుంచో బద్ధవైరమని సుబ్బారావుకి తెలీదు పాపం. అందుకే అటూయిటూకూడా చెంపకాయలు చెప్పుదెబ్బలు కూడా తిన్నాడు సుబ్బారావు. ఈ అల్లరికంతా మూలకారకుడైన వెంకటపతి మాత్రం తనకేమీ పట్టనట్లే "ఈ రోజుల్లో పనివాళ్ళను నమ్మకూడదు" అని అంటుంటె సుబ్బారావుకి కోపం, దుఃఖం, ఉక్రోషం కలిగాయి, ఒక్కసారిగా. కాని పేదవాని కోపం పెదవికి చేటనే ఇంగిత జ్ఞానంతో తన కోపాన్ని అతికష్టంగా దిగమింగాడతను. ఆమర్నాడే ఆ ఇల్లు వదిలేసి తన వూరికి బైలుదేరాడు.

కొన్నాళ్ళు తినీ తిరగడంలా సాగాయి రోజులు సుబ్బారావుకి.

"ఆడు గాడిదలా తిరుగుతుంటే వేం కష్టపడి సంపాదించి పోయాలా?ఆడినీ రమ్మను మాతో పాటు పని చేయడానికి"అంటూ ఎదురు తిరిగారు ఇద్దరన్నయ్యాలూను. పౌరుషానికి, పట్టింపుకి పోయి పొలంపనులకెళ్తే ఒక్క రోజె శరీరకష్టానికి అలసిపోయి పది రోజుల వరకు జ్వరంతోబాధ పడ్డాడు సుబ్బారావు. ఆడు అటువంటి పనులకు పనికిరాడు. చదువుకున్న సన్నాసిగందా'అనుకున్నతల్లీ దండ్రీను సుబ్బారావుని పొలంపనులకు పంపించడం మానివేసారు.

ఆవూళ్ళో పోస్టుమాన్ సెలవు పెట్టాడు.రెండు నెలలు, ఆ పనిలో ఎవర్ని పెట్టుకున్నా పని సక్రమంగా సాగిపోతుంది అనుకున్న పోస్టు మాస్టరు ఎవరు దొరుకుతారా అని చూస్తున్న సమయంలో అతనికి సుబ్బారావు గురించి తెలిసింది.

ఖాళీగావుండకుండా ఏపనైతేనేం అనుకున్న సుబ్బారావు ఆ పనికి వెంటనే ఒప్పుకున్నాడు. టపాతీసుకొచ్చి బట్వాడాచేసి, తిరిగి టపాతీసుకెళ్ళడం, మిగతా టైమ్‌లో పోస్టు మాస్టరుగారి భార్య చెప్పినపనులు చేయడమూను.

ఒక రోజు ఒకరి ఉత్తరం మరొకరికిచ్చేసాడు పేర్లు ఒకేలా ఉండటంతోనే, అది తీసుకున్న వాళ్ళు దాన్ని శుభ్రంగా చించి చదివి తనదికాదనిగ్రహించి మర్నాడు ఆ ఉత్తరాన్ని అతనికిచ్చేస్తూ "ఇది మాదికాదోయ్, మాదే అనుకుని చించేసామనుకో" అన్నారు.

దాన్ని అసలువాళ్ళకిస్తే కవరు చించివున్నందుకు వాళ్ళకెంతో కోపం వచ్చింది. మరోసారి ఇటువంటి పొరపాటు చేస్తే వూరుకోమన్నట్లు వార్నింగిచ్చారు ఘాటుగా. అనుభవంలేక తను చేసిన పొరపాటుకి చాలసిగ్గు పడ్డాడు సుబ్బారావు.

సుబ్బారావుని ఆప్యాయంగా పలకరించేవాడు ఒకతను. "నాకేమన్నా వచ్చాయా నా పేరు ఫలానా" అని ప్రతిరోజూ అడుగుతుంటే "వస్తే ఇవ్వనా సార్, మీ పేరు మీద ఏమీరానట్లుందే'అనికట్నంతా తిరగేసేవాడు తనకేమీ రాకపోయినా అలా ఎందుకడుగుతున్నాడో ఆ తర్వాత తెలిసింది సుబ్బారావుకి, అతనొక రచయిత అని, పి. యు. సి., రెండుసార్లు తప్పి ఇక చదువు మీద విసుగుపుట్టి సాహిత్య సేవ చేస్తున్నటు అతని రచనలు అడపా దడపా పత్రికా ముఖంగా వెలువడు తున్నట్లు

అప్పుడప్పుడు అతనికేదో పుస్తకాలు, పత్రికల వాళ్ళు అతని రచన స్వీకరించినట్లు తెలుపుతూ

## మనిషీ ఒక జంతువే ?

డా. శంకర శ్రీరామారావు.

ఇంటి కాపలా మంట గలిపి
కుక్కలు హక్కులకోసం మొరుగుతున్నాయి ...
చిక్కుల్లో చిక్కుకున్న బక్కవాళ్లని పట్టుకుని
నక్కలు డొక్కలు చీల్చుకు తింటున్నాయి ...
ముసలి మొసళ్లు పూర్వవాసన పోక
కసిగా కరుస్తున్నాయి కనబడ్డ వాళ్ళందర్నీ ...
పదవి పోయిన పెద్దపులి పలకరించేవాళ్లు లేక
పరాయి జిల్లా కలెక్టరులా తిరుగుతోంది ...
తోచీ తోచని తోడేలు పూచీ పేచీ లేని సంస్థ కెగ్రాబికి
అక్కడ దొరికిన మేకల్ని అహింసగా తింటోంది ...
కొబ్బరికాయ దొరికిన కోతి కొందర్ని పోగుచేసి
బ్యాండు మేళంతో ఊరేగుతోంది ...
గాదెకింద తెగతిని బలిసిన పందికొక్కు
పొదుపు ఉద్యమాన్ని గురించి ఉపన్యసిస్తోంది ...
దొంగ తిళ్లు తిని దొరికిపోయిన కాకి
కావు కావు మని అందరికాళ్ళు పట్టుకుంటోంది ...
మనిషి కూడా ఒక జంతువే అన్న సత్యాన్ని
మనకు రుజువు చేస్తున్నాయి ఈ సంఘటనలు ...

చిన్న పిల్లలకుండే, ఉపాయాలు ఊహలు పెద్దవాళ్లకుకూడా తెలియవు. మా పాపపేరు 'ఆశా'.'ఆశాకు' రెండో'ఏడు. యింకా మాటలురావు. ఏదన్నా చెప్పాలంటే చేతులు కళ్లూ తిప్పుతూ, సైగలు చేస్తుంది. ఒక రోజు పాప అన్నము తింటున్నదల్లా పీటమీదనుంచి లేచిపోయి, పీట చూపించి ఏమిటో చెప్పడము మొదలు పెట్టినది. పీట తీసివేసినాము. అది కాదన్నది తడిఉన్నదని తుడిచి కూర్చో మన్నాము. కాదన్నది. ఎన్ని విధాల చెప్పినా కూర్చోదు, అన్నము తినదు. ఆఖరుకు, కోపముగా కేకలువేసి బూచికి అప్పచెప్పతామని బెదిరించాము అప్పడు పాప బిక్క ముఖముతో రెండు నిమిషాలు



ఏదో ఆలోచించే దానిలాగ పోజుపెట్టి, గబగబావచ్చి పీట చూపించి, తను వెల్లకితలా పడుకున్నది. వెంటనే దాని చేష్టలు అర్థముకాలేదు, కాని ఆలోచించి పోనీ ఇల్లాచేసి చూద్దామని, పీటను తిరగవేసినాము. అంతే అమాంతము లేచి నవ్వుకుంటూ వచ్చి పీటమీద కూర్చుని భోజనము చేసినది. పీట ఎత్తుగాఉండి కంచం అందక అన్నము తినలేకపోయినది. పీట తిరగ వెయ్యమని చెప్పడానికి, మాటలు రావు. చిన్నారి చిలిపిచేష్టలతో మాకు అర్థమయ్యేలాగ చెప్పినదన్నమాట !

—అద్దంకి కామేశ్వరమ్మ.
(రాజమండ్రి)

పంపించేకొద్దీలూ వస్తుండేవికూడా, దానికి తోడు వాళ్ళకి అంటే పత్రికల వాళ్ళకు నచ్చని రచనలు తిరుగు టపాలో రావడం కూడా జరుగుతుండేది. అటువంటి కవర్లు వచ్చినప్పుడు మాత్రం అతని మొహం వాడిపోయేది. ఆ కవర్లను అతనికివ్వడానికి సుబ్బారావూ బాధపడేవాడు. 'వేయకపోతేసూనే తిరిగి పంపడం దేనికో, ఆ రచయిత మనసు నొప్పించడానికి కాకపోతే?'అని అనుకునేవాడు మనసులో.

ఇంకో మామ్మగారు పరిచయమయ్యారు. సుబ్బారావుకి. ఆవిడ సుబ్బారావుని చూస్తూ "నాకేమైనా కారుడొచ్చిందానాయనా"అని అడిగేది. అందుకు సుబ్బారావు ఓటపటాయిస్తూ "లేదు మామ్మగారూ ఈ రోజు రాలేదు మీకు"అని చెప్పేవాడు. అంతే ఇంతెత్తున లేచేదామె "ఎందుకు రాస్తాడూ?అది 'అదే ఆ కోడలు దయ్యం రాయనిస్తేకదూ?వుగసిల్లాడు స్వార్థపరుడోయ్, అందుకే అంటారు అడ్డాలనాడు బిడ్డలుగాని గెడ్డాలొచ్చాక బిడ్డలా.అహా కాదు, ఇంటికీ మన బంగారం మంచిదైతే కంసాలినసుకోవడం దేనికి"అనేది కోపాన్నికసిని మాటల్లో చూపిస్తూ, ఎప్పుడన్నా ఉత్తరంగాని డబ్బుగాని వస్తే ఆ రోజు చూడాలి ఆ ముసలమ్మ మొహం, మతాబులా వెలిగిపోయేది. "ఏదో అనుకుంటాముగాని మమకారాలు ఎక్కడికి పోతాయి నాయినా, మా కోడలుని మెచ్చుకోవడం గాదుగాని చాలా మంచిపిల్ల,అణకువా ఆప్యాయతా అన్నీవున్నాయి నాయినా"అని పొగిడేది కొడుకునీ కోడల్నీను. ఆ ఉత్తరాలకు జవాబులుతనే రాసి పెట్టుండేవాడు.

పోస్టు మాన్‌గా అయిదారు నెలలు చేసాడు. అసలు మనిషి రాగానే అతని పని మొదటకొచ్చింది. ఆ పనిలో వుండగా ఆయిన పరిచయంవల్ల రచయిత దగ్గరకు అడపా దడపా వెళ్ళి ఇంగ్లీషు చెప్పించుకుంటూవుండేవాడు.

రోజులు గడుస్తున్నాయి. సుబ్బారావు అన్నలిద్దరకూ పెళ్ళిళ్ళయ్యాయి. అత్తా కోడళ్ళకు పడక పొయ్యిలు కూడా వేరైపోయాయి. ఇద్దరు చెల్లెళ్లకు పెళ్ళయింది. అత్తారిళ్ళకు వెళ్ళిపోయారుకూడా. సుబ్బారావు మిల్లులో పద్దులు రాసేపనికి కుదిరాడు. జీతం బాగానే ముట్తున్నది. ఆంతకుముందు ఆకుటుంబాన్ని చిన్న చూపుచూసే బంధువులందరూ ఇప్పుడు చేరువకు రాసాగారు. "సుబ్బారావుకి మా పిల్లనిస్తాము. ఇంతకట్నం ఇచ్చి మా పిల్లనిచ్చిచేస్తాము" అనే కబుర్లు రాయబారాలు ఎక్కువయ్యాయి. సుబ్బారావుకి తెలుసు వాళ్ళందరికీ తన కుటుంబం మీద మక్కువ కాదని అది తన సంపాదన ద్వారా ఏర్పడిన మక్కువని. అందుకే తల్లిదండ్రి "ఏమంటావురా"అని అడిగినప్పుడు 'నేనిప్పుడే పెళ్ళిచేసుకోనమ్మా'అని చెప్పడం.

సుభద్ర గరల్స్ హైస్కూల్లో టీచరుగా పనిచేస్తున్నది. ఆమెకు 'నా'అనే బంధువులెవరూ లేరు. చిన్నప్పుడే తల్లిని తండ్రిని పోగొట్టుకుని అనాథగా మిగిలి పోంగ ఆ అమ్మాయిని దయాగుణంగల వో దూరపు బంధువు చేరదీసి కొన్నాళ్ళు పెంచి తన అవసానకాలం దగ్గరకు రావడం గ్రహించి ఆ అమ్మాయిని ఒక అనాథ ఆశ్రమంలో చేర్పించాడు. తిండి, బట్టా, చదువూ అక్కడే గడిచిపోయాయి. టీచరు ట్రైనింగు పూర్తవడంతోనే ఆ స్కూల్లో టీచరుగా వేసారామెను.

ఎవరూలేని ఆడది అందరికీలోకువేను. ఆమెను లొంగదీసుకోవాలని చాలా మంది ప్రయత్నించారు ప్రయత్నిస్తున్నారుకూడా కాని అంత తేలిగ్గాలొంగి వస్తుందా ఆమె ?

సుభద్రకు, సుబ్బారావుకి పరిచయమయ్యింది. ఎలా అయ్యిందంటే. వో రోజు రాత్రి సినిమాకు వెళ్ళి వస్తున్నది సుభద్ర ఒంటరిగానే. అనాథాశ్రమంలో పెరిగినందున ఆమె చాలా పొదుపుగా వాడుకుంటుంది డబ్బుని. ఎంతదూరమున్నా నడిచిపోగ్గా నడుస్తుంది. అర్ధరూపాయి యిచ్చి రిక్షాఎక్కేకన్నా ఆ అర్ధరూపాయితో, మరో ఖర్చు గడుపుకోవచ్చుగదా అన్నదే ఆమె ఆలోచన. ఆ రోజు కూడా నడిచి వస్తున్నది తన గదికి. ఆమె సినిమాకు రావడం, తిరిగి ఒంటరిగా వెళ్ళడం ఇద్దరు వ్యక్తులు గమనిస్తూనే వున్నారు. వాళ్లిద్దరూ ఆమెకు కొస్త దూరంగా వెకిలి మాటలు మాట్లాడుతూ, వెకిలిగా నవ్వుతూ వెంబడించసాగారు. తలవంచుకుని చకచకా నడుస్తున్న సుభద్ర వాళ్ళని, వాళ్ళమాటలను గమనించలేదు.

వాళ్ళిద్దరి ఉద్దేశ్యమూ నిర్మానుష్యంగావున్న చోట ఆమెను బలాత్కారంచేయాలని, లొక్కుపోవాలనీను. ఆ సమయం కోసమే చూస్తూ వెంబడిస్తున్నారు వాళ్ళు. అక్కడ లైట్లు లేవు చీకటిగా నిర్మానుష్యంగా వున్నది. దుండగుల ఆలోచన పారింది. తలవంచుకుని నడుస్తున్న సుభద్రని అమాంతంగా పట్టుకున్నారిద్దరూను. కెవ్వున అరిచింది సుభద్ర. కాస్సేపు పెనుగులాడింది వాళ్లతో. తను ఆడది, అబల. అందులో ఒంటరిది. వాళ్ళు ఇద్దరూ బలిష్టంగా వున్నారు, పైగా రవుడీల్లా వున్నారు. వాళ్ళతో ఎంతసేపు పెనుగులాడి తనని తను రక్షించుకోగలదు?ఆ రోజుతో తన జీవితం సరి అనుకుందామె. కాని భగవంతుడు ఆపదలో చిక్కుకున్నవారిని ఏదో ఒక రూపంగా వచ్చి రక్షిస్తూనే వుంటాడు. ఆ భగవంతుడే సుబ్బారావు రూపంలో వచ్చి ఆ రోజు తనని రక్షించాడని సుభద్ర నమ్మకం అందుకే అతని మీద ఎనలేని విశ్వాసం ఆమెకు.

ఆ రోజు అదే టైములో సుబ్బారావు వూరి నుండి వస్తున్నాడు. బండి చాలా లేటు. అందుకే అంత ఆలస్యంగా వస్తున్నాడింటికి. అతనికి ఇద్దరు మొగవాళ్ల మధ్య ఒక అమ్మాయి పెనుగులాడుతూ కనిపించింది. జరుగుతున్న అన్యాయం గ్రహించాడు. తను ఒక్కడూ, వాళ్లిద్దరూను వాళ్లబారి [illegible]

# అనగనగా వో సుబ్బారావుకథ

ఆమెను తప్పించగలడా తను, అతనికి వో ఐడియా వచ్చింది.

"ఒరే పుల్లయ్యా, లంకయ్యా, రంగయ్యా రండ్రా" అని అరుస్తూ వాళ్ళ దగ్గరకు పరుగెత్తాడు. తనవెనకాల పదిమంది పరుగెత్తుకొస్తున్న భావాన్ని సూచిస్తూ. అంతే. వాళ్ళిద్దరూ పిక్క బలాన్ని చూపిస్తూ పారిపోయారు. మీరు దేవుడిలావచ్చి నన్నుకాపాడారు. ఆయాసంతో రొప్పుతూ అంది సుభద్ర అతనివైపు కృతజ్ఞతగా చూస్తూ.

"నడవండి మీ ఇంటివరకూ వచ్చిదింపుతా" పొగడ్తలంటే సుబ్బారావుకిష్టం వుండదు. అయినా తనేం చేసాడని? తనుగాక ఎవరున్నా ఇలాగే చేస్తారు అంతేగాని తనకు గానట్లు వూరుకోరు గదా ?

"ఆడవారు ఒంటరిగా తిరిగితే ఇటువంటి అనర్థాలే వస్తాయి, కూడా ఎవరినన్నా తీసుకు రాలేకపోయారా ?"

"ఎవరున్నారని తీసుకురానూ ? అనుభవం అయితేనేగదా తెలిసి వచ్చేది, ఇక మీదట జాగ్రత్తగా ఉంటాను" అంది సుభద్ర ఆమె పెదవులింకా వణుకుతూనే ఉన్నాయి. భయముతో మొహం పాలిపోయింది.

ఆమెను సుబ్బారావు ఇంటివరకూ తీసుకొచ్చి దిగబెట్టాడు. అతడు వెళ్ళ నుద్యుక్తుడవుతుంటే "వాళ్ళు మళ్ళీ వస్తారేమో" అందామె భయం భయంగా చూస్తూ.

"ఇళ్ళకొచ్చి అల్లరిపెట్టేంతవరకూ ఎవరూ ప్రయత్నించరులెండి. అయినా మీకు భయమైతే ఇంటికెళ్ళి మా అమ్మను తీసుకొస్తాను"

"నా కోసం అంత శ్రమ వద్దులెండి. ఫర్వాలేదులెండి ఉంటాను. నాకు భయమేమిటి ?" అందామె అతనికి మరోసారి కృతజ్ఞత చెప్పుకొంటూ.

అలా పరిచయమయ్యింది ఇద్దరి మధ్యాను. ఎప్పుడన్నా ఆ వీధిలోకెళ్తే సుభద్రను కలుసుకోందే వెళ్ళేవాడుకాదు సుబ్బారావు.

దార్లో అతను కనిపిస్తే పలకరించందే వూరుకొనేదికాదు సుభద్ర. ఇద్దరి గురించి రకరకాల వదంతులు బయలుదేరాయి.

"ఎవత్తో పంతులమ్మను చేరదీసి పెళ్ళివద్దని నాటకమాడుతున్నావా ?" అని తండ్రి ఎగిరి పడ్డాడు. తండ్రి అపోహకు బాధ కలిగినా సమాధానం చెప్పలేక, చెప్పినా వాళ్ళు నమ్మరని మెదలకుండా వూరుకొనేవాడు సుబ్బారావు. అలా వూరుకున్నా గొడవగా ఉండేది ఇంట్లో. 'తను చేసిన పని తప్పు గనుకే అలా వూరుకున్నాడు సమాధానం చెప్పకుండా' అని తండ్రి అభిప్రాయం. ఒకసారి సుబ్బారావు వెళ్ళేసరికి సుభద్ర ఏడుస్తూ "నేనీ వూళ్ళో ఉండలేను చూడండి ఈ ఉత్తరాలు" అంటూ ఇన్ని ఉత్తరాలను తెచ్చి అతని ముందు పారేసింది. ఒక్కొక్క ఉత్తరం చదువుతూంటే అతనికి సిగ్గుతో ప్రాణం పోయినట్లు అనిపించసాగింది. ఉత్తరాలనిండా అసభ్యత అశ్లీలత చోటు చేసుకుని చదవడానికి ఏవగింపు కలిగిస్తున్నవి. ఒంటరి ఆడది బ్రతకడం చూసి సహించలేని దపుర్భాగ్యులు రాసిన ఉత్తరాలవి. ఒక ఆడది మరో మగాడితో స్నేహం చేస్తే చూసి ఈర్ష్యపడే మగవారు రాసిన ఉత్తరాలవి.

"ఎవరో రాసిన రాతలకు జడిసి పారిపోతారా ఇక్కడనుంచి ? ఇంకో చోట మాత్రం ఇటువంటి పరిస్థితి రాదని ఎలా చెప్పగలరు ? అందుకే నిదానంగా ఆలోచించి పరిష్కారం చేసుకోవాలిగాని".

"పరిష్కారమా ! అదెలా సాధ్యం ?" సుభద్ర అయోమయంగా చూసింది.

"ఎందుకు సాధ్యంకాదు. ఎవరో ఒకర్ని చూసుకొని పెళ్ళి చేసుకోండి. అప్పుడు ఈ వెధవలందరి నోళ్ళు మూతపడిపోతాయి"

"పెళ్ళా ? పెళ్ళి అదంత తేలిగ్గా ఉందా ?" నవ్వింది సుభద్ర.

"ఏం మీకిష్టంలేదా ?"

"అనాధాశ్రమములో పెరిగిన కన్నెనెవరు పెళ్ళి చేసుకుంటారండీ బాబూ, నాకు కులమా గోత్రమా ఆస్థా ? అంతస్థా ? ఏం ఉందని చేసుకుంటారు




నన్ను. నాలాంటి ఆడది పెళ్ళి చేసుకోకూడదనే ఉద్దేశ్యంతోనే అందరూ నన్నిలా వెంటబడి వేటాడి హింసిస్తున్నారు. అందరి మాటా ఎందుకు. మీరు చేసుకుంటారా నన్ను పెళ్ళి"? అడిగింది సుభద్ర.

అటువంటి ప్రశ్న తననే వేస్తుందని వూహించని సుబ్బారావు తత్తరపడ్డాడు. "నన్నా . . . నన్నా. . ." తడబడ్తూ ఆగిపోయి బిత్తరచూపులు చూడసాగాడు.

"చూశారా ? స్నేహంగా ఉన్న మీరే భయపడి పోయారే ఇక మరొకరు భయపడటంలో తప్పేం ఉంది ?"

"అదికాదు నా భావం, నన్ను అపార్థం చేసుకొంటున్నారు మీరు. నిజం చెప్పాల్సివస్తే నాకు కులగోత్రాలతో పనేలేదు. మీరు చదువుకున్నారు. ఉద్యోగం చేస్తున్నారు. నాది వానాకాలం చదువు. ఉద్యోగమా పద్దులు రాసేది. చాలా చిన్న పని..." సుబ్బారావు బిడియపడుతున్నట్లు చప్పున మొహం తిప్పేసుకున్నాడు.

"వో అదా మీ సందేహం ? నాకు కావాల్సింది చదువూ ఉద్యోగమూ కాదు, కోరేది కులమూ, ధనమూకాదు, ఉత్తమ సంస్కారిని, అతనెంత పేదవాడైనాసరే, చదువు లేకపోయినాసరే భార్యని భార్యగా ప్రేమించేవాడిని, వ్యక్తిగా గౌరవించేవాడినే నా మనసు కోరుతున్నది. అటువంటి ఉత్తమ గుణాలన్నీ మీలో ఉన్నాయి. అందుకే మీరు నాకు నచ్చారు కాని, మన పెళ్ళికి మీ వాళ్ళు అంగీకరించవద్దూ" నిట్టూర్చింది సుభద్ర.

"వాళ్ళని ఒప్పించే భారం నాది వో వేళ అంగీకరించకపోయినా మన పెళ్ళి ఆగదు" దృఢంగా పలికాడు సుబ్బారావు. అతనికి సుభద్రమీద సానుభూతి ఉంది. అనురాగముంది. ఎలాగైనా ఆమెకు అండదండలుగా నిలబడాలనే కాంక్ష ఉంది. అన్నాళ్ళూ ఆ భావాన్ని పైకి వ్యక్తం చేయకపోవడానికి కారణం ? సుభద్రకు తనమీద ఎటువంటి భావముందో ? అది తెలుసుకోకుండా తను ముందు బయటపడకూడదని ఇన్నాళ్ళూ వూరుకున్నాడు. "ఎప్పుడయితే సుభద్ర నన్ను చేసుకుంటారా ?"అని అడిగిందో అప్పుడే అతని అనుమానం తీరిపోయింది ధైర్యంగా తన ఉద్దేశ్యాన్ని బైటపెట్టాడు.

సుబ్బారావు తన పెళ్ళిమాట చెప్పినప్పుడు తండ్రి మండిపడ్డాడు. "కులంలేనిదాన్ని, దిక్కులేనిదాన్ని పెళ్ళి చేసుకుంటానని అనడానికి నీ నోరెలా వచ్చింది ? కూటికి పేదదయినంత మాత్రాన కులానికి కూడా పేదే అనుకున్నావా అలా జరగడానికి వీల్లేదు. జరిగిన్నాడు నీవు నా కొడుకు కాదనుకుంటాను" అన్నాడతను కోపావేశంతో వూగిపోతూ.

ఎప్పుడు నీవు నా ఉన్నతిని కోరుకున్నావు ? ఇప్పుడూ అంతే అనుకున్న సుబ్బారావు కట్టుబట్టలతో ఆ ఇంట్లోంచి ఇవతలకొచ్చేసాడు. ఆ మర్నాడే సుభద్రను దైవసాన్నిధ్యంలో భార్యగా స్వీకరించాడు.

పగలు ఎవరి డ్యూటీ వాళ్ళు నిర్వర్తించే వాళ్ళు. రాత్రిపూట సుభద్ర గురువు, సుబ్బారావు శిష్యుడూను. ఆర్నెళ్ళు తిరక్కుండానే భర్తను మెట్రిక్ పరీక్షలో కూర్చోపెట్టింది సుభద్ర. తరువాత వరుసగా పి. యు. సి., బి. ఏ. కూడా పార్టులుగా కట్టి పాసైనాడు సుబ్బారావు. అతను బి.ఇడి., ట్రయినింగు పూర్తి చేసుకుని వచ్చిన్నాడు, సుభద్ర పొందిన ఆనందం వర్ణనాతీతం. "ఇప్పుడు ఎవరు ఎక్కువ చదివారో ? చెప్పండి చూద్దాం" అందామె పొంగి పొరలే ఆనందంతో. "ఎంతెక్కువ చదివినా నేను మీ శిష్యుడనే మేడమ్"అని సుభద్రను దగ్గరకు లాక్కున్నాడు. "ఇప్పుడిక మనకి అభ్యంతరం లేదుకదా" అనే భావంతో చూస్తూ.

"చిత్తం మాస్టారూ" అతని గుండెల్లో మొహం దాచుకుంది సుభద్ర ●




*(గత సంచిక తరువాయి)*

## 10

**మూ**డు సంవత్సరాలు కాలం పరుగులో వెనక్కి వెళ్లిపోయాయి. అన్నపూర్ణ జ్ఞాపకాలు మరుగుపడిపోసాగాయి. కాని ... ఒకోసారి భాను మాటలు రావుకు హఠాత్తుగా అన్నపూర్ణ గుర్తుకొచ్చేలా చేసేవి.

అన్నపూర్ణను క్షమించలేని రావు, సత్య విషయంలో చాలా మూర్ఖంగా ప్రవర్తించాడు.

సత్యకు రాఘవ అంటే చాలా యిష్టం. అన్నపూర్ణ విషయం ఓ ప్రక్క హెచ్చరిస్తున్నా, సత్య రాఘవను ప్రేమించకుండా వుండలేకపోయింది. రాఘవ తల్లి, సుమిత్రమ్మ, సత్యను తన యింటి కోడలుగా చేసుకోవాలని ముచ్చటపడి ఆశగా రావు నడిగింది. రావు అంగీకరించలేదు. సరికదా ఇంటికి వచ్చిన సుమిత్రమ్మను అవమానించి పంపాడు.

"మీ కుటుంబం కామందుల కుటుంబమే కావొచ్చు. కాని ... నీకెంత ధైర్యం సుమిత్రమ్మా! నీ డబ్బు, హోదా చూసి, నా కూతురును నీ ఇంటి కోడలిని చేయడానికి నేనేం కులంలేనివాణ్ణి కాదు. వియ్యానికికాని, కయ్యానికి కాని సమవుజ్జీ కావాలి." అంటూ అనడంతో అభిమానం కల సుమిత్రమ్మ, తల వాల్చుకొని వెళ్లిపోయింది.

"ఆనాడు అన్నపూర్ణ చేసిన దౌర్భాగ్య పనికి, ఈనాడు ఈ సుమిత్రమ్మ ఆ ఆసరాతోనేకదూ నాతో వియ్యమందాలనుకుంటుంది. ఛీ..." అంటూ చీత్కారం చేసాడు రావు. అత్తయ్యలా తెగించాలనుకున్న సత్య పిరికితనం తోడుకాగా తండ్రి బెదిరింపుకు లొంగిపోయింది.

"రక్త సంబంధాన్ని తెంచుకొని వెళ్లిపోయింది అన్నపూర్ణ. ఆనాడే చచ్చిపోయిందనుకున్నాను. రావు కూతుళ్లుగా మీరేనాడు అలా చేయడానికి వీల్లేదు. నువ్వలా చేయాలనుకుంటున్నావేమో...కాని సత్యా... నిన్ను గొంతుపిసికి చంపేస్తానే తప్ప ఆ రాఘవకిచ్చి చేయను. నీవల్ల మిగతా ముగ్గురి జీవితాలను నాశనం కానీయను. ఆలోచించుకో" అన్న తండ్రి మాటలకు వెక్కివెక్కి ఏడ్చింది సత్య.

ఆ రాత్రంతా సత్య ఏడుస్తూనే వుంది. ప్రక్కనే పడుకున్న భానుకు సత్యను చూస్తే జాలేసింది. తండ్రి అలా సత్యను శాసించడం భానుకు సబబుగా అన్పించలేదు. సత్యను ఎలా ఓదార్చాలో తోచలేదు.

"అక్కయ్యా! ఎందుకలా ఏడుస్తున్నావ్?" అంటూ లేచి కూర్చున్న భానును చూసి ఉలిక్కిపడుతూ కళ్ళు తుడుచుకొని, "యింకా పడుకోలేదూ భానూ" అంది.

"నువ్విలా ఏడుస్తుంటే నాకు నిద్ర ఎలా వస్తుంది?" అంది జాలిగా, బాధగా.

"యిక నాకు మిగిలింది ఇదే భానూ!" అంది బాధగా సత్య.

"నాన్న కిష్టం లేకపోతేనేం అక్కయ్యా! నీ కిష్టంగా" అంది.

"నా యిష్టం ఎవరికి కావాలి భానూ!" అంది. రాఘవ ఎంత మంచివాడో, సుమిత్రమ్మ ఎంత మంచిదో భానుకు తెలుసు. "అత్తయ్య మంచిది. మాస్టారు మంచివాడు. అత్తయ్య మాస్టారును పెళ్లి చేసుకోవటం నాన్న కిష్టం లేదు. అక్కయ్య రాఘవను చేసుకోవడం అసలు ఇష్టం లేదు. అసలు నాన్నకు మంచివాళ్ళంటేనే ఇష్టం లేదేమో!" అనుకుంది భాను.

"అయితే నాన్న ఇష్ట ప్రకారమే..."

"ఆఁ... మంచితనం వుంటే సరిపోదు భానూ! నాన్నకు కావల్సింది కులం. నేను పెళ్లి చేసుకునేది మనిషిని కాదు. కులాన్ని. అత్తయ్య మంచి మనిషితో మనుగడ సాగించడానికి అన్నీ వొదులుకొని నాన్నను ఎదిరించి వెళ్ళింది. కాని... నేను రావు కూతురిని. అత్తయ్య కున్న ధైర్యం, తెగువ నాకు లేవు. నేనిలా రావు కూతురుగానే మిగిలిపోతాను." అనుకుంది సత్య. కళ్ళలో నుండి నీళ్ళు జలజల రాలాయి.

"అక్కయ్యా! నాన్న ఇష్టం తీర్చడానికి, నువ్విలా ఏడుస్తూ అయినా ఒప్పుకుంటున్నావ్! మరి నాన్న ఎందుకు నీ యిష్ట ప్రకారం చేయడు?" అంది భాను సూటిగా.

"నాన్న పెద్దవాడు కదూ! ఆయన మాట మనం వినాలి. మనకు ఇష్టం లేకున్నా సరే!" అంది సత్య.

"ఎలా అక్కయ్యా! నువ్వు అన్నం తినడం నాన్న కిష్టముండదు. అలా అని తినడం మానేస్తావా?" అంది భాను ఆశ్చర్యపోతూ. సత్య విస్తుపోయింది.

"అన్నం తినకూడదని ఎందుకంటాడు. ఒక వేళ అన్నా... అందులో మంచి వుందనుకోవాలి. మన మంచి కోరేకదూ... నాన్నా..."

"అందులో మంచి వున్నప్పుడు, వుందని నీకు తెలిసినప్పుడు నువ్విలా ఎందుకు ఏడుస్తున్నావ్?" అంది.

"ఇది జీవితం భానూ! నీ కిష్టం లేని స్నేహితురాలితో నాన్న చెబితే స్నేహం చేయగలవా? బాధగా వుండి ఏడ్వవూ?"

"నా కిష్టంలేనప్పుడు ఎలా అక్కయ్యా!" అంది భాను.

"నాన్న చెబితే వినవూ?"

"ఆ అమ్మాయితో స్నేహం చేసేది నేను. నాన్న కాదుగా. నా కిష్టంలేకపోతే ఎలా స్నేహం చేస్తాను." అంటున్న భాను మొహంలో కదిలిన ధైర్యాన్ని చూస్తూ ... తమ జ్ఞాపకాల్లో మిగిలిన అత్తయ్య భానులో నిండిపోయింది అనుకుంది సత్య.

## 11

సత్యకు రావు సంబంధం నిశ్చయం చేసాడు. ముహూర్తాలు నిర్ణయించినరోజు, సత్య నిర్వికారంగా, నిశ్శబ్దంగా వుండడం చూసి భాను చిన్నారి మనసు తల్లడిల్లిపోయింది. "అక్కయ్యకేదో అన్యాయం జరుగుతోంది" అంటూ బాధపడిపోయిన భాను మిగతా యిద్దరిలా కళ్లప్పగించి చూస్తూ వుండలేకపోయింది.

"నాన్నా! నీ కిష్టంలేని పని అక్కయ్య చేస్తే తప్పుకదూ!" అంది ఉపోద్ఘాతంగా తండ్రి ప్రక్కన చేరి. 'అవు'నంటూ తలూపాడు రావు.

"మరి అక్కయ్య కిష్టంలేని పెళ్లి నువ్వు చేయడం తప్పుకాదా నాన్నా?" అంది భాను. ఆ ప్రశ్నలో అమాయకతతోపాటు ధైర్యం నిండి వుండడం చూసి విత్తరపోయాడు రావు.

"అలా అని ఎవరు చెప్పారూ? అక్కయ్య కిష్టంలేదని నీతో చెప్పిందా?"

"ఊహు ... నీ కిష్టంలేని పని చేస్తే నీకు కోపం వస్తుంది. అక్కయ్య కిష్టంలేని పెళ్లి చేస్తే అక్కయ్యకు కోపం వచ్చినా ఏం చేస్తుంది నాన్నా? అందుకే ఏడుస్తోంది." అంది భాను జాలిగా.

"అక్కయ్యకేం తెలీదమ్మా భానూ! వొట్టి అమాయకురాలు." అన్న తండ్రి మాటలకు విస్మయంగా చూస్తూ — "అక్కయ్యకు తనకేది యిష్టమో కాదో తెలీదూ?" అంది.

"ఇష్టంకాదమ్మా! ఏది మంచో ... ఏది చెడో తెలీదు!" అన్నాడు రావు.

"మంచి, చెడు ... అంటే ఏమిటి నాన్నా?" భాను ప్రశ్నకు జవాబు తడుముకుంటూ, "బురద గుంటవైపు వెడితే బురద అంటుకుంటుందని అక్కయ్యకు తెలీదమ్మకో. తెలిసిన నేను చెప్పొద్దూ మరి" అన్నాడు.

"బురదగుంట వుందని తెలిసినప్పుడు, బురద అంటుకుంటుందని మాత్రం ఎలా తెలీదు నాన్నా?" అంది ఆశ్చర్యపోతూ.

"అక్కయ్యకు తెలీదుకాబట్టేనమ్మా నేను చెప్పడం. మన కులం కానివాణ్ణి పెళ్లి చేసుకోవడం బురదగుంటలో కాలు పెట్టడం వంటిదే. అలా పెళ్లి చేసుకుంటే మన కులం పోతుంది. మన పరువు ప్రతిష్ఠ బురదపాలై పోతాయ్" అన్నాడు.

"అత్తయ్య మాస్టారును చేసుకుంటె కులం పోతుందనే కోప్పడ్డావా నాన్నా?" పాలోచనగా అడిగింది భాను. ఊఁ... అంటూ మూల్గాడు రావు. భాను అన్నపూర్ణను గుర్తు చేయడం ఆయనకు బాధ కలిగించింది.

"అంటే అత్తయ్య మాస్టారును పెళ్లి చేసుకున్ననాడే మన కులం పోయినట్టుగా నాన్నా! యింకా పోకుండా వుంటే, అక్కయ్య రాఘవను చేసుకుంటే మాత్రం ఎలా పోతాయ్?" పన్నెండేళ్ళు నిండుతున్న భాను మెదడుకు తట్టిన ఆలోచన, అడిగే తీరు,

**జరిగిన కథ 4:** జగన్నాధరావు చెల్లెలు అన్నపూర్ణ. పిల్లల బాధ్యత అన్నపూర్ణ కప్పగించి కన్నుమూస్తుంది జగన్నాధరావు భార్య మహలక్ష్మమ్మ. భాను తన ముగ్గురక్కలవలె కాక నిర్భయంగా మాటాడుతుంది తండ్రితో. క్రొత్తగా ఆ వూరు వచ్చిన పురుషోత్తమరావు మాస్టారు జగన్నాధరావు ఇంట్లో ఉంటూ వారి పిల్లలకు ట్యూషను చెపుతుంటాడు. భానుకు మాస్టారంటే చాలా ఇష్టం. స్కూలు వార్షికోత్సవం నాటకంలో భాను పాల్గొనటానికి అతి కష్టంమీద అంగీకరిస్తాడు రావు. వేడి పాల గిన్నె అందుకోటంలో అన్నపూర్ణతో పరిచయమౌతుంది పురుషోత్తమరావుకు. రావు గారి ఆవు కుమ్మగా గాయపడిన మాష్టారును చూడటానికి వెళ్ళిన అన్నపూర్ణ అతను ఒంటరివాడని తెలుసుకొని మనసిస్తుంది. రావుగారు చెల్లెలికి వేరేసంబంధం చూస్తుంటాడు. తన దృఢ నిశ్చయాన్ని అన్నగారికి చెప్పి పురుషోత్తమరావుతో వెళ్ళిపోతుంది అన్నపూర్ణ.

మాటల్లో ధైర్యం చూసి చాటుగా వింటున్న సత్య, రుక్మిణి, రాధ వణికిపోయారు భయంతో. రావు మాత్రం విసుక్కున్నాడు.

"ఒకరు చెడిపోయారని అందరూ చెడిపోతారా భానూ! మీ రెప్పుడూ అలా చేయకూడదు. మీరు నా కూతుళ్ళు. రావు కూతుళ్ళనిపించుకొని, రావు కూతుళ్ళుగానే మిగలాలి" అన్నాడు. ఎంతో సౌమ్యంగా చెప్పాలనుకున్నా అతని కంఠంలో కటుత్వం కద లాడ్డం కనిపెట్టిన భాను చాలా సేపటివరకు ఏమీ అడగలేక "నాన్నా!" అంది చివరికి.

"ఏమిటమ్మా భానూ!" అన్నాడు రావు కూతురు మొహం చూసి దగ్గరికి తీసుకుంటూ.

"మనకంటె తక్కువ కులం వాళ్ళతో పెళ్ళిళ్ళు చేసుకుంటే మన కులం పోతుంది. మరి వాళ్ళ కులం వుంటుందా నాన్నా!"

"ఊఁ..." అన్నాడు రావు.

"ఎలా వుంటాయ్ నాన్నా! ఒకరికి వుండి మరొకరికి ఎలా పోతాయ్?" అంది.

భాను ధర్మ సందేహం ఎలా తీర్చాలో రావుకు అర్థం కాలేదు.

"భానూ! నువ్వు చిన్నదానివి కదూ! నీ కెందుకీ గొడవలన్నీ! వెళ్ళి చదువుకో..." అంటూ పంపించేసాడు.

అసంతృప్తిగా లేచి వెళ్ళిపోతున్న రావుకు ఓ ప్రక్క భయం వేసింది. — ఈ చిన్న వయసులో ఇంత నిష్కర్షగా, సూటిగా ఎలా మాట్లాడుతోంది. ఇంటావంటా లేని ఈ ఆలోచనలు, తెలివి చూస్తుంటే ఆ తెలివికి ఆశ్చర్యపోవాలో, ఆనందించాలో, గర్వపడాలో, లేక బాధపడాలో తెలిసేది కాదు రావుకు. కాని అతనికి హఠాత్తుగా 'భాను నా కోడలు అన్నయ్యా! నా కోడ లనిపించుకుంటుంది" అన్న అన్నపూర్ణ మాటలు గుర్తుకు వచ్చి, ఏవేవో ఆలోచిస్తూ కూర్చునేవాడు.

పెళ్ళిరోజు దగ్గరి కొచ్చేసింది. అస్తమానం ఏడ్చే సత్యను చూసి "ఎందుకు అక్కయ్యా ఏడుస్తావ్" అంది రుక్కు ఓదారుస్తూ, ఏడ్చి లాభం లేదనే ధోరణిలో.

"చ...నేను అందుకు ఏడ్వడంలేదు." అనే సత్య మాటలకు, "అక్కయ్యకు నిజం చెప్పాలన్నా భయమే" అంది భాను.

భాను మాటలకు ఉలిక్కిపడుతూ చూసింది సత్య ముగ్గురి పిరికివాళ్ల మనసుల్లో మెదిలే పైకి అనిపించని విప్లవరూపం – భాను. తనలా ఏనాడు భాను నాన్న మాటలకు లొంగిపోదు.

సత్య పెళ్లి అనేసరికి, రావుకు మాటిమాటికి అన్నపూర్ణ గుర్తుకొచ్చింది. మానిన గాయాన్ని రేపుతూ. బాధ, ఆవేదనల మధ్య నలిగిపోయాడు.

"ఒట్టి దౌర్భాగ్యురాలు! నా చేతులమీదుగా పెళ్లి జరిపించాలని ఎంత ఆశించానో! దిక్కులేని దానిలా గుళ్లో పెళ్లి చేసుకొని, ఆ బికారి వెధవతో వెళ్లిపోయింది. ప్చ్... అ దృ ష్ట హీ ను రా లు!" అంటూ సరిపెట్టుకున్నాడు మనసును.

"అమ్మ ఎలాగూ లేదు. అత్తయ్యకూడా ఉండి లేకుండా అయిపోయింది." సత్య మాటలు విని విసుక్కున్నాడు రావు.

"పోని... పిలిపించు నాన్నా! పెళ్లయిపోగానే పంపించెయ్!" అంది భాను ఆశగా.

"నోర్ముయ్! ఈ యింటి గడప తొక్కడానికి వీల్లేదు." అన్నాడు.

"ఏం? ఎందుకని?" కోపంగా అడిగింది భాను. సత్య చటుక్కున భానును దగ్గరికి తీసుకుంది.

"ఆ బికారి వెధవతో వెళ్లిపోయినందుకు! అది ఈ యింటి గడప తొక్కితే అక్కయ్య పెళ్లి కాదు." అన్నాడు కసిగా.

"ఏం? అత్తయ్య వస్తే అక్కయ్య పెళ్లెందుకు కాదు. అసలు అత్తయ్య రావడం నీ కిష్టం లేదు. నీకు అత్తయ్య అంటే కోపం. నన్నుకూడ పంపించెయ్. నేనిక్కడ అసలు వుండను" అంది ఏడుస్తూ.

"అవును. అదంటె నాకు కోపం. అసహ్యం. ఈ యింటికి అది రావడమేకాదు, ఇంకోసారి నువ్వు దాని పేరెత్తడంకూడా నా కిష్టంలేదు." అన్నాడు.

"ఎప్పుడూ నీయిష్టమే నాన్నా! అందుకే అత్తయ్య వెళ్లిపోయింది. ఇప్పుడు అక్కయ్య ఏడుస్తోంది..." భాను మాట పూర్తికాకముందే అన్నపూర్ణ గురించి రెండోసారి చెంపదెబ్బ తిన్నది భాను. "ఇది నా యిల్లు. నా యిష్టప్రకారమే నడవాలి" అంటూ గబగబా అడుగులువేస్తూ వెళ్లిపోయాడు రావు. భాను ఏడ్వలేదు. విగ్రహంలా నిలబడిపోయింది.

ఇంట్లో శుభ కార్యం జరుగుతూ వుంటే యింట్లో అన్నపూర్ణ లేని వెలితి కనిపిస్తుంటే ఓ ప్రక్క ఆవేదనతో మరోప్రక్క స్వార్థంగా వెళ్ళిపోయిందన్న బాధ రావును నలిపేస్తుంటే భాను మాటలు అగ్నిలో ఆజ్యం పోసినట్టు గావడంతో ఆవేశం అణచుకో లేకపోయాడు.

భానును కొట్టి బయటికి వచ్చాకా, కాని ఆయన కోపం చల్లారలేదు. — "పాపం! పసిపిల్ల. అన్నపూర్ణ వాళ్ళో పెరిగింది. కన్న తల్లిని మరపించిన అమ్మలాంటి అన్నపూర్ణను భాను ఎలా మర్చిపోతుంది? తను తొందరపడి కొట్టాడు. తానే ఆవేశంలో ఏదో అంటాడు కాని... తాను మాత్రం అన్నపూర్ణను మర్చిపోగలిగాడా? తల్లి వాళ్ళో పెరిగినట్టు పెరిగిన భాను మర్చిపోతుం దనుకోవడం, మర్చిపొమ్మనడం వ్యర్థం.

కాని... భానుకు అన్నపూర్ణ గుర్తు రాకుండా చూడాలి. తను భానుకు మరింత సన్నిహితు డవ్వాలి. భానును కొట్టకూడదు. కసురుకోకూడదు. అని అనుకుంటున్న రావుకు సంతృప్తి కలగలేదు.

ఊహూఁ... యింకా ఏదో చేయాలి. అప్పుడు కాని భాను మరెప్పుడు అత్తయ్య దగ్గరికి వెళ్తానని అనదు. అనుకున్నాడు.

పిల్లలు తండ్రిగా తమ యిష్టాన్ని తీర్చాలి. అది వారి బాధ్యత. అని ఆలోచించే రావు, తండ్రిగా పిల్లల ఇష్టాన్నీ గుర్తించి, అర్థం చేసుకొని తీర్చాలి. అప్పుడు కాని, తండ్రిగా తన స్థానం నిలుపుకోలేడు అని మాత్రం ఆలోచించలేక పోయాడు.

కాసేపటికి శాంతించి, లోపలికి వెళ్ళాడు రావు. భాను వొంటరిగా గదిలో టేబుల్ దగ్గర కూర్చొని ఆలోచిస్తోంది.

"భానూ! కొట్టానని కోపం వచ్చిందా తల్లీ!" అన్నాడు అనునయంగా దగ్గరికి తీసుకుంటూ. భాను మాట్లాడలేదు. తండ్రి గుండెల్లో వొదిగిపోయింది.

"నన్ను వొదిలి పోతానంటే నాకు కోపం వచ్చేసింది తల్లీ..." అంటూ, తాను కొట్టిన బుగ్గ, నిమురుతూ, అంటున్న తండ్రి కళ్ళలో లీలగా కదులుతున్న నీటి పొరను చూసి, భాను మనసు జాలితో నిండిపోయింది.

"నిన్ను వొదిలి ఎక్కడికి వెళ్ళను నాన్నా!" అంటూ, తన చిన్నారి చేతులతో తండ్రి కంఠాన్ని పెనవేసి బావురు మంటూ ఏడ్చేసింది భాను. రావు, కూతురును గుండెలకు హత్తుకొని వీపు నిమురుతూ ఓదార్చాడు.

ఎంతో ఆడంబరంగా, సత్య పెళ్లి అనుకున్న రోజు జరిగిపోయింది, రావుకు అన్ని విధాల అన్ని విషయాల్లో తగిన కుర్రా డనిపించాడు విశ్వనాథం. ఎలాటి లోటు జరగకుండా చూసాడు రావు. కాని... సత్య పెళ్లి రుక్మిణి జీవితంలో ఓ మలుపుగా మారింది.

## 12

రాధ స్కూల్ఫైనల్ ప్యాసయ్యింది. రావు సంతోషపడిపోయాడు. పెద్దవాళ్లిద్దరు అంతవరకు చదువుకున్నా, రాధ ప్యాసయ్యిందనగానే "రావు కూతురు" అనుకుంటూ గర్వపడ్డాడు. ఏనాడు ఏది కావాలని అడగని రాధ పట్నం వెళ్లి కాలేజీలో చేరతాననేసరికి రావు ఆలోచన్లో పడిపోయాడు.

అసలే అమాయకురాలు. ఒంటరిగా హాస్టల్లో వుండి ఏం చదువుతుంది? పదిహేనో ఏడు దాటుతుంది. ఒంటరిగా పంపించడం...ప్చ్...బావుండదు. అని అనుకుంటున్న రావుతో భాను, "అక్కయ్య చదవకుండా ఏం చేస్తుంది నాన్నా!" అంది.

నిజమే. సత్య అత్తవారింటికి వెళ్లిపోవడంతో యింటి బాధ్యత రుక్మిణిమీద పడింది. చదువుమీద

బొత్తిగా శ్రద్ధలేని రుక్మిణి యింట్లోనే వుండిపోయింది. రుక్మిణి పెళ్లయ్యేవరకు రాధ చదువుకోకుండా ఏం చేస్తుంది ?

"అంత దూరం వెళ్లి చదువుకుంటావా రాధా ?" అన్నాడు రావు.

"నీకిష్టమైతే తప్పకుండా చదువుకుంటుంది నాన్నా !" అన్న భాను మాటలకు క్షణంసేపు కూతురు మొహంలోకి చూసి ఊఁ... అన్నాడు రావు.

రాధ పట్నం వెళ్లిపోతూ, భానును వొదిలిపోతున్నందుకు అమాయకంగా ఏడ్చేసింది, "మరో సంవత్సరానికి నేను వచ్చేస్తాను అక్కయ్యా" అంటూ నవ్వి, రాధను ఓదార్చిన భాను మాటలు రావును ఉలిక్కిపడేలా చేసాయి. ఎంత నిశ్చయంగా చెబుతోంది అనుకున్నాడు.

కాలం ముందుకు కదిలింది. రుక్మిణి చాలా మారిపోయింది. ముఖ్యంగా రెండు మూడుసార్లు సత్య ఉత్తరం రాయడంవల్ల వెళ్లి ఓ వారంరోజుల పాటు వుండివచ్చాకా, రుక్మిణిలో చాలా మార్పు వచ్చింది. కాలం కదలికలోని కొన్ని క్షణాలు రుక్మిణి మనసులో చెరగని ముద్రలు వేసాయి. దాంతో యింటి పనులతో తీరికలేకుండా చేసుకుంది రుక్మిణి. ఎప్పుడైనా తీరిక అంటూ దొరికితే, తన గదిలో కెళ్లి గట్టిగా కళ్లు మూసుకు పడుకునేది. తెగని ఆలోచనలతో జవాబు దొరకని ప్రశ్నలతో, ఏదో భయం ఆవహించగా, వొణికిపోతూ, పరిష్కారం లేని సమస్యలతో, నీరసించిపోయే మనిషిలా కన్పించేది.

రావు ఏదైనా పెళ్లి సంబంధం గురించి మాట్లాడితే, ఆరోజు అదోలా పరధ్యానంగా వుండేది. ప్రతి మాటకు కళ్లలో నీళ్లు నింపుకునేది. భాను ఏదైనా అడిగినా, ఆ సమయంలో ఎవరైనా గట్టిగా మాట్లాడినా, చిరాకుపడిపోయేది. భాను ఆ క్షణంలో తన కేదైనా కావాలని అడిగితే, విసుగ్గా చూసి, ఆ విసుగును ఎలా ప్రదర్శించాలో తెలీక, తలను గోడకేసి కొట్టుకుంటూ, "నన్నిలా ఎందుకు విసిగించి చంపుతావే భానూ..." అని అంతలోనే బావురుమని ఏడ్చేస్తూ, "నాన్నతో చెప్పకూ ?" అంటూ బ్రతిమాలేది.

ఎదుగుతున్న వయసుకంటే వేగంగా మనసు పెరిగిపోయి, పరిస్థితులను ఎదుటి సంఘటనలను అర్థంచేసుకోగల భాను, రుక్మిణి వెర్రి కోపాన్ని, అర్థంలేని చిరాకును కొత్తగా అలవడ్డ ఆ తల బాదుకోవడాన్ని కేవలం విసుగ్గా తలచి ఊరుకోలేకపోయి, నిలదీసి అడిగింది.

"ఎందుకిలా అయిపోయావ్ అక్కయ్యా! ఏమైంది నీకు ? ఎందుకిలా మారిపోయావ్ ఏం జరిగింది ?" అంటూ అడగడంతో: జవాబుగా వేడి కన్నీళ్ళు తప్ప మరో జవాబు చెప్పలేదు రుక్మిణి.

సంవత్సరం గిర్రున తిరిగిపోయింది. రాధ పి. యు. సి పరీక్షలురాసి వచ్చింది. రావు, రుక్మిణికి పెళ్లి నిర్ణయించాడు. రుక్మిణి, ఆలోచనలకు, సమస్యలకు పరిష్కారంగా, గోపాలంతో రుక్మిణి పెళ్లి జరిగిపోయింది. మారు పలక్కుండా తలూపి, తల వాల్చింది రుక్మిణి. సత్యలా ఎలాంటి సమస్య తనకు లేకుండా పెళ్లికి ఒప్పుకున్న రుక్మిణిని చూస్తూ "ఎంతైనా రావు కూతురు... ముందు కాస్త ఏడ్చినా సత్య కాపురం చేసుకుంటోంది హాయిగా. మరి... వీళ్ళు రావు కూతుళ్ళు" అంటూ మురిసిపోయి గర్వపడ్డ రావు మనసు ఏ మూలలో... అన్నపూర్ణ లీలగా మెదిలింది. "ప్చ్... రావు చెల్లెలిగా విలిచే భాగ్యం లేదు" అనుకున్నాడు.

పెళ్ళిలో కళ్ళనీళ్ళు నింపుకుంటున్న, రుక్మిణిని చూసి, తనకు తోచిన విధంగా అర్థం చెప్పుకుంటూ "పిచ్చితల్లి బెంగ పడిపోతుంది" అనుకున్నాడు. కాని



# ధర్మపథం • జ్ఞానము—ప్రేమ • బులుసు వేంకటరమణయ్య

చిరుతొండనంబి కథ అందరికీ తెలుసును. అతడు చెరకుగడల మోపు మొయ్యలేక పరమేశ్వరుణ్ణి ప్రార్థింపగా – ఆ దేవుడే దానిని మోసి, ఇల్లు చేర్చాడు. ఆ శ్రమవల్ల అతనికి చెమట పట్టింది! ఈ రీతిని భక్తునికోసం భగవంతుడు శ్రమపడినట్లు చాలా దాఖలాలు ఉన్నవి.

నిజమైన భక్తుడు దేవుణ్ణి ఎంతో ప్రేమిస్తాడు. అతని రూపాన్ని ఎంతో సుకుమారంగా భావిస్తాడు. అతనిని శ్రమపెట్ట ఇచ్చగించడు.

జ్ఞాని అయినవాని పద్ధతి వేరు. బాధ్యతను అతడు భగవంతునికే అంటగడతాడు.

వీలయినంతవరకూ స్వప్రయత్నంమీద ఆధారపడి వుండడం మేలు.

ఒకప్పుడు ఇద్దరు మిత్రులు ఒక అడవి మార్గంగా వెళ్లడం తటస్థించింది. వారిలో ఒకడు జ్ఞాని. మరొకడు సున్నితమైన హృదయం గల భక్తుడు. వారు పోతూ వుండగా ఒక పెద్దపులి కనబడింది. భక్తుడు ముందుకు అడుగు వెయ్యకుండా అలాగే నిలిచిపోయాడు. జ్ఞాని ముందుకు పోదలచాడు. భక్తుడు అతనిని వారించి 'మిత్రుడా! మనం ముందుకు పోవడం భావ్యం కాదు. వెళ్లితే ప్రమాదం తప్పదు. పులి మనల్ని చూడకుండా వున్నప్పుడే దూరంగా పరిగెత్తిపోయి, ఏ చెట్టయినా ఎక్కి ప్రాణాలు కాపాడుకుందాం' అన్నాడు. జ్ఞాని 'అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడు' అన్నాడు.

అప్పుడు భక్తుడు 'మిత్రుడా! మానవుడు తనకు సాధ్యమయినంతవరకూ ప్రయత్నించి – అప్పటికీ సాధ్యం కాకపోతే దేవుణ్ణి శ్రమపెట్టడం తప్పదనుకో. అపాయాన్ని తప్పించుకునే ఉపాయం మన చేతిలో వున్నప్పుడు దానిని వినియోగించుకోకుండా భగవంతుణ్ణి బాధపెట్టడం మంచిది కాదు. మనం పరుగెత్తిపోవడమే మేలైన పని' అని అన్నాడు.

జ్ఞానికి తన మిత్రుడు చెప్పినదే ఉచితమైనదని తోచింది.

భగవంతునిపై విశ్వాసం, గొప్ప గౌరవం ఉన్నవాడు ఆయనకు శ్రమ కలగకుండా ఉండేటట్లు చూచుకోవాలి.



# అన్నపూర్ణ

భానుకు మాత్రం తడి ఆరని కళ్ళతో ప్రతి క్షణం పరధ్యానంగా అదోలా కన్పించే రుక్మిణికి, ఈనాడు కళ్ళనీళ్ళు నింపుకుంటున్న రుక్మిణికి బేధం తెలియక, "అక్కయ్య ఎందుకో బాధ పడుతోంది! అక్కయ్యకీ పెళ్లి ఇష్టం లేదా?" అని అనుకున్న క్షణాలు వున్నాయ్. అందుకే తండ్రిని అడిగింది – "నాన్నా! అక్కయ్యకు ఈ పెళ్లి ఇష్టమే కదూ!" అంటూ. భాను మాటలకు పాలోచనగా కూతురు మొహంలోకి చూసి, నవ్వేస్తూ "నీ మొహం! నీ కన్నీ అనుమానాలే. వెళ్ళి రుక్కు నడుగు ఈ విషయం!" అన్నాడు.

"భాను మరీ అతిగా ఆలోచిస్తుంది నాన్నా!" అంది రుక్కు నవ్వేస్తూ.

"నే నిలా అతిగా ఆలోచించడానికి కారణం నువ్వే" అంది కోపంగా భాను.

"అక్కయ్యా! నాన్నతో అబద్ధం చెప్పావు కదూ!" అంది భాను మెళ్ళో మెరుస్తున్న మంగళసూత్రాలను చూసి ఏడుస్తున్న రుక్మిణితో.

"ఛ... లేదు" అంది తడబాటుగా రుక్మిణి.

"అయితే ఈ కన్నీళ్ళేమిటి? ఎందుకు?" అంది.

"నీ పెళ్లయి నప్పుడు..." రుక్కు మాట పూర్తి కాకముందే, "ఇంతగా మాత్రం ఏడ్వను" అంది.

భానుకు విశ్వనాథం కంటె గోపాలం బాగా నచ్చాడు. "బావగారు చాలా చక్కగా మాట్లాడతారు అల్లరిగా" అంటూ మెచ్చుకుంది. రాధ 'ఔ' నంటూ తలూపడం చూసిన రుక్మిణి కెందుకో కోపం వచ్చింది.

రాధ పై చదువుకు రావును గోపాలం ఒప్పించాడు. "పుత్తడి బొమ్మలాంటి రాధ కోసం వరుడు వెతుక్కుంటూ వస్తాడు మామయ్యా. చదివించండి. పెళ్లి గురించి బాధ పడకండి" అంటూ. రావు గర్వంగా కూతురు వంక చూసాడు.

భాను స్కూల్ఫైనల్ జిల్లా మొత్తంలో ప్రథమురాలిగా ప్యాసయ్యింది. ఫలితాలు తెలిసినరోజు స్కూల్ హెడ్మాస్టరు స్వయంగా రావు యింటికి వచ్చి అభినందించాడు. "భాను చాలా తెలివిగల అమ్మాయి రావుగారూ! భానూ మా స్కూల్ విద్యార్థిని కావడం నాకెంతో గర్వంగా వుంది. భానును లాయరు చేయండి" అన్నాడు.

రావు భానువంక గర్వంగా చూసాడు. భాను నా కూతురు అనుకున్న క్షణం ఆయన మనసంతా ఆనందంతో గర్వంతో నిండిపోయింది. "నువ్వు రావు కూతురు ననిపించావమ్మా!" అని అంటున్న రావు మాటలకు భాను నవ్వింది. ఆ నవ్వును చూసిన రావు ఉలిక్కిపడ్డాడు. భాను నవ్వులో అన్నపూర్ణ కదిలింది.

సెలవులైపోగానే రాధతోపాటు తాను బయలుదేరడానికి అన్నీ సర్దుకుంటున్న భానును చూసి, కనీసం "నేనుకూడా అక్కయ్యతోపాటు వెళ్లి చదువుకుంటాను నాన్నా" అని అడగని భానును చూస్తూ రావు ఏమీ మాట్లాడలేదు. రాధ చదువుతున్నప్పుడు భాను చదవక ఏం చేస్తుంది? అని సరిపెట్టుకున్నాడు.

"నువ్వొక్కడివి ఇక్కడెలా వుంటావ్ నాన్నా! మాతోపాటు పట్నం వచ్చేయ్" అని అన్న భాను మాటలకు నవ్వేసాడు. ఈ వయసులో తోడుగా లేకుండా వెళ్లిపోయిన భార్యను జ్ఞాపకం చేసుకోవాలో, స్వార్థంగా వెళ్లిపోయిన అన్నపూర్ణను నిందించాలో తెలీలేదు రావుకు. కాని... బోసిపోయి, నిశ్శబ్దం పేరుకున్న యిల్లు చూసి, ప్రతి క్షణం... "అన్నపూర్ణే వుంటే" అని ఆలోచిస్తూ గతం గుర్తుకు రావడంతోపాటు కోపం వచ్చి తల విదిల్చేసేవాడు రావు.

## 13

ఆరోజు రాధ స్నేహితురాలు, క్లాస్మేట్ అయిన సుజాత మరీ మరీ పిలవడంతో రాధ సుజాతతో వాళ్లింటికి వెళ్లింది. చిన్నప్పటినుండి మూగిగా వుండే రాధ కాలేజీలో చేరి రెండో ఏడు నడుస్తున్నా, ఒక్క సుజాతను తప్ప మరో స్నేహితురాలిని సంపాదించుకోలేదు. కారణం – సుజాత రాధలా మూగిగా వుంటుందనేకాదు. కొన్నిరోజులు రాధతోపాటు హాస్టల్లో ఒకే రూమ్లో వుండడమే.

సుజాతతో వాళ్లింటికి వెళ్లడం అదే మొదటిసారి. భానును రమ్మంది రాధ ఒంటరిగా వెళ్లడానికి సంకోచిస్తూ.

"డోంట్ బి సిల్లి! రాధక్కా! ఆవిడ నిన్ను పిలిచింది వెళ్లిరా! ఫ్రండ్ యింటికి వెళ్లాలన్నా భయమేమిటి?" అంది భాను విసుక్కుంటూ. రాధ కాలేజీలోకాని, హాస్టల్లోకాని ఎవరితో మాట్లాడకపోవడం భాను చాలాసార్లు హెచ్చరించి విసుక్కుంది. అయినా రాధలో మార్పు రాలేదు. భాను మాటలకు, హెచ్చరికలకు జవాబుగా నవ్వేసేది.

రాధ తిరిగి వచ్చేసరికి, సాయంత్రం అయింది. భాను నిద్రపోతోంది. బట్టలు మార్చుకొని మంచం మీద కూర్చుంటూ, భాను నుదుటికి కట్టుకున్న రిబ్బన్ చూస్తూనే గాబరాపడిపోతూ "భానూ" అంటూ తట్టి లేపింది.

"కాస్త తల నెప్పిగావుంటే కట్టుకున్నాను అక్కయ్యా! తగ్గిపోయింది" అంటూ అబద్ధం

(30 వ పేజీ చూడండి)





**Arthi**
వాష్-ఎన్-వేర్ 2 x 2 వాయిల్స్

**Lavanya**
వాష్-ఎన్-వేర్ 2 x 2 కేంబ్రిక్స్

***Suchitra***
హెచ్. టి. వాయిల్స్

**Sharmila**
సెమి ఫుల్ వాయిల్స్

**Pushpanjali**
వాష్-ఎన్-వేర్ డైడ్ కేంబ్రిక్ వాయిల్స్

# దావణగేరె
బట్టలు

*ది దావణగేరె కాటన్ మిల్స్ లిమిటెడ్—*
*...సాంప్రదాయముగా నమూనాలకు సౌందర్యమును సమకూర్చుచున్నది!*

Thomas/DCM/10 ® Te





## ప్రేమ యాత్ర!

అందాల నటుడు శోభన్ బాబు, ఆంధ్రుల ...నే వాణిశ్రీ సురేష్ మూవీస్‌వారి "చక్రవాకం" చిత్రంలో యురవైలో వున్నట్టు అగుపించారు. ... అగుపించడానికి కారణ కర్త్గా వున్నారు ... ట్యాన్ బారట్స్.

"చక్రవాకం" నవలలోని కిరణ్ పాత్రను శోభన్, రాణి పాత్రను వాణిశ్రీ పోషించారు. ఇద్దరూ ప్రేమించుకుంటారు. పెండ్లి చేసుకొనడానికి బాస చేసుకుంటారు.

పావన కృష్ణానదీ జలాలలో ప్రారంభమైన వీరి ప్రేమయాత్ర భూలోక స్వర్గము అనిపించుకునే కాశ్మీరు వరకు పయనించింది.

రాణీ కిరణ్‌ల ప్రేమ హృదయాన్ని ఆచార్య ఆత్రేయ ఎంత అందంగా వ్రాశారు.

'ఈ నదిలా నా హృదయం పరుగులు తీస్తుంది' అని కిరణ్ ప్రారంభించ, "ఏ ప్రేమ కడలికో, ఏ వెచ్చని వాడినో వెతుకుతు వెడుతుంది" అంటూ రాణి, కిరణ్ వాడిలో వాలిపోతుంది. ఈ శృంగార ఘట్టంలో శోభన్, వాణిశ్రీ పోటీ పడి నటించారు. ఆత్రేయ విరచితమైన యీ విలువైన పాటకు, మహదేవన్ సంగీతాన్ని సమకూర్చి, సుశీల రామకృష్ణలచేత మధుర మనోహరంగా పాడించారు.

సురేష్ రామానాయుడుకి జాక్‌పాట్ కొట్టే యోగం వున్నది. మధుసూదనరావుకు "విక్టరీ" నిస్తుంది.

## దీర్ఘ సుమంగళి

గోపాలకృష్ణ ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న చిత్రం పేరు యిది. దీనిని "కథా నాయకుడు" నిర్మాత గోపాలకృష్ణ నిర్మించ, ఆ చిత్ర దర్శకుడు పేమాంబరధరరావు దీనిని చేస్తున్నారు. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచనను, చక్రవర్తి సంగీతాన్ని, వి. ఎస్. ఆర్. స్వామి ఛాయను, బి. ఎస్. కృష్ణ కళను, శ్రీహరిరావు కూర్పును చేపట్టారు.

"దీర్ఘ సుమంగళి"లో ఒక దృశ్యం



## నిక్కచ్చి మనిషి!

"దీర్ఘ సుమంగళి" చిత్రానికి కృష్ణ కథా నాయకుడు. చాలా మంచి వేషం. క్రమశిక్షణ తన ధ్యేయంగా, న్యాయం తన పరమావధిగా జీవితాన్ని నడిపిన నిక్కచ్చి మనిషిగా కృష్ణ చాలా హుందాగా నటిస్తున్నట్టు తెలుస్తోంది.

అతడి సహధర్మచారిణిగా, భర్తను కంటికి రెప్పలా కాపాడుకునే అర్ధాంగిగా, అతడి ఆజ్ఞను సారంగా యింటిని, పిల్లలను చూచుకునే వుత్తమ యిల్లాలుగా జమున అద్వితీయంగా నటిస్తున్నట్టు తెలుస్తోంది.

కృష్ణ జమునల మధ్య నటనలో గెలుపు ఎవరిదో నిర్ణయించడం అంత సులభం కాదు అంటున్నారు, రషస్ చూచిన రసజ్ఞులు.

ఈ చిత్రంలో రేలంగి, ప్రభాకరరెడ్డి, రాజబాబు, చంద్రమోహన్, ప్రేమకుమార్, బాబురావు, జయసుధ, లీల, రమాప్రభ, రాధాకుమారి ముఖ్య తారాగణం.

ప్రతి ఇల్లాలు భర్తపట్ల ఎలా వుండాలి? ప్రతి భార్యా భర్తను ఎలా గౌరవించాలి, బిడ్డలు తల్లిదండ్రులకు ఎలా తోడ్పడాలి? అనెడి మంచి విషయాలు వున్న చిత్రం "దీర్ఘ సుమంగళి".

## దొరబాబు ఢిల్లీ పయనం

ఫణి మాధవీ కంబైన్స్‌వారి "దొరబాబు" వర్ణ చిత్రం తాలుకు యిన్‌డోర్ షూటింగు జులై ఆఖరుతో పూర్తయింది. రెండు పాటల చిత్రీకరణ

మా్త్రం జరగవలసి వుంది. ఈ రెండూ నాగేశ్వరరావు, మంజులపై చిత్రీకరించాలి. ఈ సంచిక మీ చేతనున్న సమయానికి అవుట్‌డోర్‌కూడా పూర్తవుతుంది. ఈ కథను గొల్లపూడి వ్రాశారు.

నేపాల్ అని, కాశ్మీరని, చండీఘర్ అని, లక్కదీవులని లోగడ వ్రాశాను. కానీ ఢిల్లీ, ఆగ్రా పరిసర ప్రాంతాలలో అక్కినేనితో మంజుల విహరించే వలపు పాటల చిత్రీకరణ జరిగి యుంటుంది. దీనికి తాతినేని రామారావు దర్శకుడు. రాఘవులు సంగీత సారథి.

''దొరబాబు'' చిత్రంలో నాగేశ్వరరావు ఎన్నో రకాల గెటప్స్‌లో కనిపిస్తారు. ప్రతి గెటప్‌లో ప్రత్యేకత కనిపిస్తుంది. మంజులతో ఆయన చేసిన శృంగారం గిలిగింతలు పెడుతుంది. పాటలకు ఆయనిచ్చిన మూవ్‌మెంట్సు మురిపిస్తాయి. ఆయన చంద్రకళ పట్ల చూపిన అనురాగం ఆత్మీయతా భావాన్ని కలగచేస్తుంది. ఆయన సత్యనారాయణతో ఢీకొన్న దృశ్యాలు గగుర్పాటు కలిగిస్తాయి. ఈ చిత్రానికి సెల్వరాజ్ ఛాయాగ్రహణ దర్శకుడు.

వచ్చే గాంధీ జయంతినాడు అనగా అక్టోబరు రెండున ''దొరబాబు'' విడుద లవుతుంది. దీనిని రాజేంద్రప్రసాద్ + సుబ్బారావు నిర్మించారు.

## దేశ రక్షకుడు !

రాజేశ్వరీ ఫైనార్ట్స్ నిర్మిస్తున్న ''రాముని మించిన రాముడు'' చిత్రంలో నటరత్న ద్విపాత్రాభినయం చేస్తున్న విషయం పాఠకులకు తెలుసు. రెండు పాత్రలను ఆయన పోషించి చాలారోజులైంది. ఆయన అద్వితీయంగా నటించడానికి రెండు అపూర్వమైన పాత్రలు దొరికాయి.

దేశాన్ని రక్షించే మేజరు పాత్ర ఒకటి. ప్రాణాన్ని రక్షించే డాక్టరు పాత్ర మరొకటి. ఈ చిత్రంలో అభిమానులు హర్షించే రామారావు అగుపిస్తారు. దీనికి గోపీనాథ్ దర్శకుడు.

''రాముని మించిన రాముడు'' చిత్రానికి డి.వి. నరసరాజు రచనను, చలపతిరావు సంగీతాన్ని, జి.కె. రాము ఛాయను నిర్వహిస్తున్నారు. ఇందులోని ముఖ్య భూమికలను జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, త్యాగరాజు, రామదాసు, శ్రీవిద్య, రమాప్రభ ధరిస్తున్నారు. కథానాయికగా వాణిశ్రీ నటిస్తున్నది. ఈ చిత్రాన్ని గోపీనాథ్ మరియు భక్తవత్సలం నిర్మిస్తున్నారు.

మేజర్ గెటప్‌లోని గాంభీర్యం, డాక్టర్ గెటప్‌లోని శాంతం చూడాలంటే వచ్చేవారం యిద్దరూ కలిసివున్న ఫోటో చూడండి.

## శుక్రవార వ్రతం !

చంద్రకళను పుత్తడిబొమ్మలా తీర్చిదిద్దాడు, పుట్టించిన దేవుడు. కానీ ఒక పెద్ద దోషాన్ని అంటగట్టాడు. దానిని 'సర్పదోషము' అంటారు. అది వున్నవాళ్ళకి త్వరగా కళ్యాణం కాదు. ఆ దోషం నివర్తి కావడానికి ఒక మార్గం వున్నది. ప్రతి శుక్రవారం వ్రతం ఆచరించి, నాగదేవతను అర్చించి, పుట్టలో పాలు సమర్పిస్తే సకల సౌభాగ్యాలు సంప్రాప్తిస్తాయి.

చంద్రకళ ప్రతిరోజూ పుట్టకు వెళ్లి పాలు పోసేది. తనకు మంచి భర్తను అనుగ్రహించమని ప్రార్థించేది. ఆమె మొరను నాగదేవత ఆలకించింది. భక్తితో ఆమె యిచ్చే ప్రసాదాన్ని ఆరగించి, ఒకనాడు ప్రత్యక్షమైంది.

నాగుపాము చంద్రకళకు సలక్షణమైన భర్తను వెతికింది. కారులో వెడుతున్న ఒక ఎస్టేటు యజమానిని చంద్రకళకు భర్తగా నిర్ణయించింది. అతడు రామకృష్ణ.

తనకు మంచి భర్తను, మంచి జీవితాన్ని యిచ్చిన నాగదేవతను ప్రతినిత్యం ఆరాధించేది. ప్రతి పనికి ఆమె ఆశీర్వాదాన్ని అర్థించేది. నాగుపాము కనిపిస్తేచాలు, రామకృష్ణ తుపాకీతో తయారయ్యేవాడు. ''తను ముఖ్యమో ? లేక నాగుపాము ముఖ్యమో ? నిర్ణయించుకో'' అని భార్యను శాసించాడు. ఆమెకు యిద్దరూ కావాలి. ఇద్దరిమధ్య ఎలా ఆరాటపడింది ? ఇద్దరినీ ఎలా మెప్పించగలిగింది ? అనెడి ప్రశ్నలకు సమాధానం ఏ. వి. ఎం. వారి ''నోము'' చిత్రంలో లభిస్తుంది. ఈ చిత్రానికి పట్టు దర్శకుడు. దీనిని మురుగన్, కుమరన్, శరవణన్ నిర్మిస్తున్నారు.


''అమ్మ మనసు''లో శుభ, విజయ


''దీక్ష''లో ఒక దృశ్యం



"నోము"లో కె.వి. చలం, జయసుధ

# సినిమా

## ప్రేమపక్షులు

ఉషశ్రీ ప్రొడక్షన్స్ ఎప్పుడో ప్రారంభించిన "ప్రేమ పక్షులు" చిత్రం షూటింగు ఈ నెల ఏడవ తేదీతో పూర్తయింది. ఈ చిత్రంలో ప్రకాష్ – చంద్రకళ ప్రేమజంటగా నటించారు. ముఖ్య పాత్రలను విజయలలిత, కృష్ణకుమారి, జయకుమారి, కృష్ణంరాజు, సత్యనారాయణ, చంద్రమోహన్, రేలంగి, అల్లురామలింగయ్య, ముక్కామల, నల్ల రామ్మూర్తి పోషించారు. ఈ చిత్రానికి అశ్వద్ధామ సంగీతాన్ని, సుకదేవ్ ఛాయను, జాన్సన్ రచనను చేసిపెట్టారు. నిర్మాత పి. చిన్నపరెడ్డి ఈ చిత్రానికి దర్శకుడు.

## గుడ్ బై

"ప్రేమపక్షులు" చిత్రానికి దర్శకత్వం నిర్వహించిన చిన్నపరెడ్డికి ముమ్మందు అలాంటి వుద్దేశ్యం లేనట్లు నాతో చెప్పారు. ఇదే అభిప్రాయం ఆదిలో వుండివుంటే, ఉషశ్రీ పతాకం గగనంలో ఎగురుతూ వుండేది. "స్వయంకృతాపరాధం, ఏం చేస్తాం, అంతా కాలదోషం" అని ఆయన నిట్టూర్చాడు.

## శోభన్ వితరణ!

ఉషశ్రీ నిర్మించిన "పసిడి మనసులు, విచిత్ర దాంపత్యం, మానవుడు – దానవుడు" చిత్రాలలో శోభన్ నాయకుడు. చివరి చిత్రం శోభన్ నట జీవితంలో ఎంత పెద్ద మలుపును తెచ్చిపెట్టిందో అందరికీ తెలిసినదే.

ఆనాడు నాలుగుమాసాలు ఆగమన్నాడు చిన్నపరెడ్డిని. ఆగివుంటే, శోభన్‌కి ఉషశ్రీ అతి ముఖ్యమైన సంస్థగా వుండేది.

తన మిత్రుడు మళ్లీ మొనగాడు కావాలి అన్న భావం శోభన్‌లో తలెత్తింది. అందుకే చిన్నపరెడ్డికి ఒక చిత్రం చెయ్యడానికి సుముఖతను వెల్లడించాడు. శోభన్ విశాల హృదయాన్ని చిన్నపరెడ్డి మరువరాదు.

"మానవుడు – దానవుడు" కన్నా మిన్నగా వుండే కథను ఆయన ఎన్నుకునే ప్రయత్నంలో వున్నాడు. "అయ్ విష్ హిమ్ ఆల్ ది బెస్ట్."

## భానుమతి చిత్రంలో శారద

ఈమధ్య భానుమతిని ఆమె స్వంత స్టుడియోలో కలిశాను. తెలుగు చిత్రం ప్లాన్ చెయ్యడం లేదా అన్నాను. "రెండు కథలు రెడీ అవుతున్నాయి. ఒకటి ఆగస్టులో ఆరంభమవుతుంది. దీనికి డి. వి. నరసరాజు సినిమా అనువాదం + మాటలను వ్రాస్తున్నారు. శారద ముఖ్య పాత్రను పోషించవచ్చు. మరొకటి తమ వ్రాసిన కథ. అక్టోబరులో సెట్స్‌కి వెడుతుంది." అన్నారు ఆవిడ.

"అంతా మన మంచికే" చిత్రం యిప్పుడు తమిళంలో నిర్మితమవుతున్నట్లు ఆమె ద్వారా తెలుసుకొన్నాను.

## భానుమతి నూరవ పాటకచ్చేరి!

గంధర్వ గానమని, కోయిల కంఠమని అంటారే, అది భానుమతి ఆలాపనలో ధ్వనిస్తుంది. ఆమె కచ్చేరి అంటే జనం తండోపతండాలుగా రాకుండా వుంటారా? అప్పటికే 99 కచ్చేరీలు జరిపి ఆంధ్ర దేశమంతా ఏకైక గాన సరస్వతి అన్న బిరుదాన్ని అందుకొన్న అసాధ్యురాలు.

ఒకరోజు ఫోను అదేపనిగా మ్రోగుతూవుంది. కాస్సేపటికి ప్రభాకరరెడ్డి ఫోను తీసి, "నో, ఆమె రాదు. కచ్చేరి చెయ్యదు" అని కోపంగా సమాధానం యిచ్చాడు. అతడి వాలకాన్ని భానుమతి చూసింది. కోపాన్ని దిగమింగింది. "ఏం, ఏమైంది. మీకు ఆరోగ్యంగా లేదా. ఇప్పుడేగా టిఫిన్–కాఫీ అయింది." అని దబాయించింది.

"ఏం, ఎగతాళిగా వుందా!" అన్నాడు రెడ్డి.

"అది నేనడగవలసిన ప్రశ్న. నేను వెళ్లితీరాలి. నన్ను పాడొద్దని చెప్పడానికి కారణం. ఇది నూరవ పాటకచ్చేరి. పాట వచ్చేది నా గొంతునుండికాని మీ జేబునుండి కాదు." అంటూ చరచర వెళ్లిపోయింది. "కట్" అన్నారు దర్శకుడు పద్మనాభం. ఈ ఘాటయిన ఘట్టం రేఖా అండ్ మురళీ ప్రొడక్షన్స్ వారి "మాంగల్య భాగ్యం"లో కనిపిస్తుంది. ఈ చిత్రంలో పద్మనాభం తండ్రి కొడుకుల వేషం ఒక ప్రత్యేకత. అలాగే రమాప్రభ ద్విపాత్రాభినయం కూడా. భానుమతి అపూర్వ నటన + గంధర్వగానం మరొక ప్రత్యేకత. ఆమె పాడిన పాప్ సాంగ్ చిత్రానికి హైలైటు.



"మాంగల్య భాగ్యం"లో తండ్రీ కొడుకులు →

## దేవుడు చేసినపెళ్లి

శ్రీ లక్ష్మి ప్రొడక్షన్స్ నిర్మిస్తున్న రంగుల చిత్రానికి ఈ పేరు స్థిరపరచినట్టు నిర్మాత పూర్ణ చంద్రరావు చెప్పారు.

కథ గొల్లపూడిది. మాటలు సత్యానంద్‌వి. సంగీతాన్ని చలపతిరావు సమకూర్చ, ఛాయను కన్నప్ప చేపట్టారు. అన్ని పాటలు రికార్డింగ్ అయినాయి. ఉన్న ఆరు పాటలలో మూడు మళ్లీ మళ్లీ వినాలనిపించేవిధంగా వున్నాయి.

### శోభన్ - శారద

పోస్ట్‌మెన్‌గా శోభన్, పంతులమ్మగా శారద నటిస్తున్నారు. విధి యిద్దరినీ ముడివేసింది. దంపతుల్ని చేసింది. సుఖంగా, సంతోషంగా సాగే వారి కుటుంబంలో దేవుడు కొంత ఇబ్బంది కలిగించాడు. సహనంతో ఆ యిబ్బందిని తప్పించాడు కథానాయకుడు.

ఈ చిత్రంలో కోనసీమ అందాలు, కేరళ సుందర ప్రదేశాల వెలుగులు ప్రత్యేక ప్రశంసలకు పాత్రమవుతాయి. ఇందులో కాంతారావు, రావు గోపాలరావు, కాకరాల, కె. విజయ, గిరిబాబు ముఖ్య పాత్రధారులు. కథకు పెద్ద సపోర్టునిచ్చే మూడు పాత్రలను ఎస్వీరంగారావు, లక్ష్మి, చంద్రమోహన్ గొప్పగా నటించగలరని తెలుస్తుంది. ఈ చిత్రాన్ని జనాకర్షణీయంగా రూపొందిస్తున్నారు, దర్శకుడు తాతినేని రామారావు.

## పెళ్లికి పెదనాన్న అంగీకారం

కృష్ణంరాజును విజయలలిత గాఢంగా ప్రేమించింది. ఆమెను కృష్ణంరాజు అమితంగా ఆకర్షించాడు. ఇద్దరూ దంపతులవుదామనుకొన్నారు. ఒక చిన్న యిబ్బంది వచ్చిపడింది. అదేమిటంటే.

విజయలలితను పెంచి పెద్ద చేసిన పెద్దనాన్న వున్నాడు. అతగాడు గ్రీన్ సిగ్నల్ యిస్తేనే గాని, యిద్దరికీ పెండ్లి జరగదు. తన అభిప్రాయాన్ని పెద్దనాన్నతో చెప్పేసింది. "నీ సంతోషమే నా సంతోషం. నీ యిష్టప్రకారమే చేసుకో" అని ఆమోద ముద్ర వేశాడు పెద్ద తండ్రి.

ఆమె ఆనందానికి అవధులు లేవు. తన ప్రియుడి దగ్గరికి వెళ్లింది. పెండ్లికి తన అంగీకారాన్ని తెలిపింది. అతడు ఆమెను తన హృదయానికి హత్తుకొన్నాడు. ప్రేమ చేష్టలతో ఆమెను పరవశింపచేశాడు. ఆమె మాత్రం వూరుకొంటుందా?

"ఆరడుగు లున్నాడు అందాల చిన్నోడు" అని అతడి అందాన్ని కళ్లతో జుర్రుకుంది.

"ఇంతింత కళ్లున్నవి అవి ఏమేమి అంటున్నవి" అంటూ ఆమెను తన బిగి కౌగిలిలో యిరికించాడు. ఈ శృంగార ఘట్టం నళినిశ్రీ ప్రొడక్షన్స్ వారి "నిత్య సుమంగళి" చిత్రంలో కనిపిస్తుంది. ఈ పాటను డాక్టర్ నారాయణరెడ్డి వ్రాయ, రాజేశ్వరరావు సంగీతం సమకూర్చ, కొత్త గాయకుడు రామారావు, జానకి పాడారు. ఈ చిత్రానికి బి. ఎన్. ఆర్. దర్శకుడు.

## విజయలలిత పుట్టిన రోజు

ఈమె జన్మదిన సందర్భంగా, మహాకవి

ఎవరికివారే యమునాతీరే లో సత్యనారాయణ

జగ్గయ్య ఒక అపురూపమైన పాటను వ్రాశారు ఆ పాటను మధుర మధురంగా జయంతి పాడింది ఇట్టి కవితను, యిట్టి గానాన్ని, యిట్టి వాట్యాన్ని ముఖ్య పాత్రలుగా చేసి ఎస్ వి ఎస్ ఆర్ పిక్చర్స్ "ఉత్తమురాలు" చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

"కోనసీమ కొబ్బరి తోటల్లో
వాన కాలం మబ్బుల నీడల్లో
కోల కళ్ళ చిన్నదానా! నిన్ను చూడాలి!
నీ వన్నె చూడాలి!"

ఈ పాటను ఆచార్య ఆత్రేయ వ్రాశారు. సుశీల పాడింది. "జీవన తరంగాలు" రాఘవులు సంగీతం కూర్చాడు. విజయలలిత పుట్టిన రోజుకు జగ్గయ్య యిచ్చిన కానుక యీ పాట. జయంతి పాడిన పాట మరొక కానుక.

"ఉత్తమురాలు" చిత్రానికి కథ, మాటలను కిరణ్ వ్రాశారు దీనికి దేవరాజ్ ఛాయను, మోహన్ కూర్పును, ఎ వి రమణమూర్తి నిర్మాణ నిర్వహణను చేపట్టారు. బి. భారిరెడ్డి, వి. వెంకటేశ్వరరావు నిర్మిస్తున్న యీ చిత్రానికి పి. శ్రీనివాసరెడ్డి దర్శకుడు. ముఖ్య పాత్రలను జగ్గయ్య, జయంతి, విజయలలిత, గుమ్మడి, పద్మనాభం, రాజనాల, వాగేష్, జాన్సీ పోషిస్తున్నారు. ఆగస్టు 14వ షూటింగు ఆరంభం. కొత్తదనం వున్న కథ.



"ఆడంబరాలు-అనుబంధాలు"లో సావిత్రి, ప్రభాకరరెడ్డి

## న భూతో న భవిష్యతి !

ఆంధ్రులు ఆరాధించే ప్రియతమ వెండి తెర నాయకుడు యావద్భారతం ప్రశంసించే పౌరాణిక కథానాయకుడు యిప్పుడు ఒక మహాయజ్ఞాన్ని తల పెట్టారు. ఇలాంటిది గతంలో రాలేదు. భవిష్యత్తులో రాబోదు.

### దాన వీర శూర కర్ణ

ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మితమయ్యే ఈ భారత చరిత్ర న భూతో న భవిష్యతి అని కీర్తింపబడుతుంది మహా విద్వాంసుడు కొండవీటి వెంకటకవి చేత రచనా రమణీయతను చేయిస్తున్నారు, దర్శకుడు నందమూరి తారకరామారావు. సినిమా ట్రీట్‌మెంటును ఎన్టీఆర్ వ్రాశారు.

### రాధేయుడు, కృష్ణుడు, దుర్యోధనుడు

విభిన్నమైన ఈ మూడు పాత్రలను పోషించడం ఒక్క రామారావుకు తప్ప మరెవ్వరికీ సాధ్యం కాదు అన్న నిజాన్ని ఎవరూ కాదనలేరు. ఇందులో అభిమన్య కుమారుడిగా చిరంజీవి. బాలకృష్ణ నటిస్తాడు.

తెలుగు దేశమే కాదు. యావద్భారతం గర్వించదగ్గ మహా కావ్యంగా "దాన వీర శూర కర్ణ" వస్తుంది. రావాలని ఆ దేవుడ్ని కోరుతున్నాను.

# ప్రశ్నావళి  కె. రామలక్ష్మి

గోపి ఆంధ్రా

అందమైన అమ్మాయినైతే ప్రేమించానుగాని—

★ కట్నం డబ్బులు ముట్టవని భయంగా వుంది. అవునా?!

ఎమ్ వి ఎన్ రాయచోటి

మీ జవాబులు చాలా ఘాటుగా వుంటాయి పచ్చిమిరపకాయలు తింటారా? ఒట్టి మిరపకాయలు తింటారా?

★ అసలు కారం తినను బొత్తిగా అరవతిండి — సాంబారుసాదం, తైరుసాదం . ఘాటు నా తత్వం

పి ఎస్ ఆర్ సింధనూరు

మీ జవాబులు క్లుప్తంగా ఉంటున్నాయి మాలతీచందూరుగారు చూడండి మాకు విశదీకరించి మనస్సును హత్తుకునే విధంగా జవాబులు యిస్తున్నారు కనుక పాఠకుల అభిప్రాయాన్ని పట్టి నదుచుకోగలరని ఆశిస్తున్నాను

★ మీకు గైడుబుక్కులే చదివి—బుర్ర ఆలోచించడం మానేసినట్టుంది విషయగ్రహణశక్తికి విశదీకరణ అక్కర లేదు అసలు విషయం చెప్తే చాలు గన్‌షాట్‌లా బుర్రకెక్కుతుంది! ఇది నా తత్వం. మాలతి సౌమ్యురాలు నేను గయ్యాళిని

కె ఆర్ ఐ హోసూరు

మినీ ఇంటర్‌వ్యూలో తెలుగువారై వుండి తెలుగువాళ్లను హేళనచేసే ప్రకటనలు చేస్తారు

★ మనని చూసి మనం నవ్వుకోగల్గాలి అది ఆరోగ్యానికి చిహ్నం

మన తప్పులు మనం ఒప్పుకోకల్గాలి అది పురోగమనానికి మార్గం

పి ఎస్ పి మైలారగడ్డ

కె రా గారూ మీ 'అడది' నవలను పినిమాగా తీస్తున్నారటగా మరి సినిమాకి కధ రాయరు కదండీ ఎవరూ?

★ రాయరు రాసిన కథను సినిమాకి మలుస్తారు!

ఎమ్ ఎస్ తామరకొల్లు

మీ సమాధానం చదివితే — మగవారి మీద ఎంత కక్ష వుందో అర్థం అవుతుంది మీ సమాధానం నూటికి తొంభైమంది కూడా హర్షించరు మిమ్మల్ని చూస్తే జాలి వేస్తుంది .

★ మీ జాలి కాస్త దాచుకోండి రోడ్డు మీద, బస్సుల్లో, సినిమాల దగ్గిర, యితర పబ్లిక్ స్థలాలలో ఆడదాన్ని ఎంత అసహ్యంగా, ఎంత అసభ్యంగా అల్లరి చేసే మగవాళ్లున్నారో మీకెలా తెలుస్తుంది? తెలిసినా మీకేం బాధ అదే మీ తల్లో, అక్కో, చెల్లో, పెళ్లామో అయితే—విరుచుకు, పడతారు! . ఈ రోజుల్లో కుర్రాళ్లకంటే 'మిడిల్ ఏజిడ్ మెన్' ఎంత అసహ్యంగా పబ్లికులో ప్రవర్తిస్తారో—రోజూ బస్సు ఎక్కక తప్పని అమ్మాయిలని అడగండి రోజూ సాయంత్రం మార్కెట్‌కి వెళ్లే గృహిణిని అడగండి కక్ష కాదు స్వామీ, నాది బాధ సాటి మనిషిని యిలా చూసే మగవాళ్లమీద నాకే కాదు — మగవాళ్లకి కూడ అసహ్యం కల్గదా మధ్యన మీకెందుకింత ఉడుకుబోతుతనం?! గుమ్మడికాయల దొంగలా!

పి ఎస్ యమ్ ఆర్ , కె వి పురం

మీరు కొన్ని చెత్త ప్రశ్నలకు జవాబులు యిస్తూ వుంటారు అది మీకు నరదా?

★ కాదు. అలాంటివి అడిగే వారుంటారని మీలాంటి వుత్తములకు తెలియడం కోసం —

కె ఎన్ బి. చిత్తూరు

మానవుని యొక్క జీవితం దేని మీద ఆధారపడి వుంది?

★ ఆయుర్దాయం మీద!

అనుకొని సాధించడం గొప్పదా? అనుకోకుండా సాధించడం గొప్పదా?

★ అనుకొని సాధించడం — ప్రయత్న ఫలం అనుకోకుండా సాధించడం ఛాన్సు ఏదైనా ఒకటే మొదటిదాల్లో ఆత్మతృప్తి రెండోదాల్లో థ్రిల్

కె యు ఆర్ తెనాలి

అమెరికాలో యువతీ యువకులు దిగంబరులై చూచేవారికి ఆశ్చర్యం కల్గేలా కనబడుతూ మెరుపు తీగెల్లా మాయమౌతున్నారట ఇది కూడా ఫాషన్‌లో భాగమా?

★ కాదు ప్రొటెస్టు ఎన్నో రకాలుగా యువతరం తమ అసంతృప్తిని తెలియచెప్తూనే వున్నారు ఇదీ — ఒక పద్ధతి

---

## — సినిమా —

### హీరో తీసుకున్న సముచిత నిర్ణయం

ఇప్పటికి 30 సంవత్సరాలైంది, హీరోగా నటించడం ప్రారంభించి అయినా జనానికి ఆయన మీద మోజు తగ్గలేదు సరికదా అధికమవుతుంది

ఇటీవల ఒక ఎగ్జిబిటరు ఒక మంచి మాట అన్నారు "నాగేశ్వరరావుగారి పిక్చర్‌కి ఫరవాలేదు అని టాక్ వస్తే, అది 25 లక్షలు వ్యాపారం చేస్తుందట హిట్ అయితే 40 లక్షలకు తగ్గదట"

గత నెల "దొరబాబు" డబ్బింగుకోసం ఆయన మదరాసు వచ్చినప్పుడు నేను కలిశాను

మీరు నటిస్తున్న కొత్త చిత్రాలను గూర్చి చెప్పగలరా? అని ప్రశ్నించాను "చాలా వున్నాయి నవంబరు వరకు ఆగితే, మొత్తం ఎన్నో చెప్తాను" అన్నారు ఎన్ని ఒప్పుకున్నా సంవత్సరానికి మూడు చొప్పున విడుదలవుతాయి అని చెప్పారు

వెరైటీ వేషాలున్న కథలను, మనస్సుకు సంతృప్తినిస్తూ, ప్రేక్షకులకు యిష్టాన్ని కలిగిస్తూ, నిర్మాతలకు డబ్బును తెచ్చిపెట్టేవాటిని మాత్రమే అక్కినేని చెయ్యదలిచారు

అక్కినేని తీసుకున్న నిర్ణయం సముచితము కాదని ఎవరయినా అనగలరా? ఆయన రిటైరు కారు అన్న నిజాన్ని యిప్పుడైనా తెలుసుకొన్నారా?

### నాగయ్య ఆశయం

స్వర్గీయ నాగయ్య నాతో తరుచూ అనేవారు "నే వేసిన యోగి వేమన, త్యాగయ్య పాత్రలను చిరంజీవి అక్కినేని పోషిస్తే చూడాలని వుంది" అని ఆయన ఆశయం ఫలించే రోజు దగ్గర్లోనే వుంది

"నట సామ్రాట్" నాగేశ్వరరావు త్యాగయ్యగా, వేమనగా నటించడానికి నిర్ణయించారు మహానటుడు నాగయ్య ఆశీస్సులు అక్కడ్నుంచే అక్కినేనికి లభిస్తాయి

### మహాకవి క్షేత్రయ్య

"భక్త తుకారామ్" నిర్మించిన అంజలీ పిక్చర్స్‌కి అక్కినేని అంగీకరించిన చిత్రం యిది ఈ కథకు స్వర్గీయ మల్లాది రామకృష్ణశాస్త్రి సినిమా ట్రీట్‌మెంటు కొంతవరకు రాసినట్టు, నిర్మాత ఆదినారాయణరావు చెప్పారు

పది + ఎనిమిది క్షేత్రాలను తిరిగిన యీ భక్తుడి జీవిత కథను ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తారు, అంజలీ పిక్చర్స్ అధినేత

—శ్రీనివాస్



"చక్రవాకం"లో శోభన్, వాణిశ్రీ

**సాయంత్రం అయిదుంబావుకల్లా ఆఫీసు నుంచి ఇంటి కొచ్చాడు రామ్మూర్తి స్కూటర్‌మీద.**

అప్పటికే పకోడీలు వండి, డైనింగ్ టేబుల్ మీద ఆజీలుగా ఉంచింది భార్య రమణమ్మ

పిల్లలు ఆడుకోవడానికి పక్కింటి కెళ్లారు.

రామ్మూర్తి పకోడీలు తింటూంటే, ఏదో ఘనకార్యం చేసిన దరహాసంతో పక్కనే కూర్చుంది రమణమ్మ

'ఏమిటే విశేషాలు ?' అన్నట్టు భార్యకేసి కుతూహలంగా చూశాడు రామ్మూర్తి.

"ఇందాక వెంకట సుబ్బయ్య కిరాణా కొట్లో సరుకులు తెచ్చానండీ. మొత్తం అరవై రూపాయల అరవై పైస లైనాయి. కాని మనకు ఆర్రూపాయలు గిట్టుబాటైంది. ఎల్లాగో చెప్పుకోండి చూద్దాం" అన్నదామె కనుబొమల్లో గర్వాతిశయాన్ని ప్రదర్శిస్తూ.

"అదీ నువ్వే చెప్పు. ఇంతలో అంత సస్పెన్సు దేనికీ" అన్నాడు రామ్మూర్తి పకోడీల ప్లేటును ఖాళీ చేస్తూ

రమణమ్మ కాఫీ తెచ్చి యిచ్చింది.

"ఒక సబ్బు పేకెట్‌కు ధర కట్టడం మర్చిపోయాడు వెంకట సుబ్బయ్య. నేను కనిపెట్టాను అయినా చెప్పలేదు అమ్మే వాడు జాగ్రత్తగా ఉండాలిగానీ, కొనేవాళ్ల దేముంది ? .."

"యు ఆర్ పర్‌ఫెక్ట్లీ కరెక్ట్. భేష్షయిన పని చేశావు!" అన్నాడు రామ్మూర్తి భార్య నిర్వాహకాన్ని భలేగా మెచ్చుకొంటూ

"తర్వాత కనుక్కొని ఇంటికి కుర్రాణ్ణి పంపిస్తాడేమో!" అన్నది రమణమ్మ అనుమానంగా

"ఆఁ! వాడికి గుర్తు రాబోయిందా ? ఆఫీసు నుంచి ఇంటి కొచ్చేముందే వాడి కొట్లో సిగిరెట్లు ప్యాకెట్టుకొన్నాను వెంకట సుబ్బయ్యే ఇచ్చాడు నా దగ్గర ఆ ప్రస్తావ నేమీ తీసుకురాలేదే!" అన్నాడు రామ్మూర్తి

"అయితే మర్చిపోయే వుంటాడు" అన్నది రమణమ్మ అనుమానం కాస్త తీరగా.

రామ్మూర్తి కాఫీ త్రాగి సిగిరెట్టు ముట్టించాడు అంతలో 'సార్' అంటూ ఇంటి గేటు ముందు కేక వినిపించింది

వెంకటసుబ్బయ్య కిరాణాకొట్లో కుర్రాడు వచ్చాడు

రమణమ్మ గుండెల్లో రాయి పడ్డంత పనైంది.

"ఏమిటోయ్!" అన్నాడు రామ్మూర్తి తెచ్చిపెట్టుకొన్న గంభీరతతో. అవసరమైతే తన భార్య ఆ సబ్బు పేకెట్ తీసుకురాలేదనే అబద్ధం ఆడటానికి సంసిద్ధుడై.

రమణమ్మ బయటకు తొంగిచూసింది గానీ, ధైర్యంగా బయటకు రాలేకపోయింది.

"ఏం లేదు సార్! ఇందాక మా కొట్లో మీరు సిగిరెట్టు పెట్టె కొన్నారంట. అయిదు రూపాయలకు బదులు ఆర్రూపాయలు ఇచ్చారంట మీరిచ్చిన అయిదురూపాయల నోటు మడతలో ఓ రూపాయికూడా వుందట. ఇదు గోండి — ఆ రూపాయి మీ కిచ్చిరమ్మన్నారు. కొనేవాళ్లు అజాగ్రత్తగా వున్నా, మేము జాగ్రత్తగానే వుంటాం సార్" అన్నాడు కుర్రవాడు ఆ రూపాయినోటు యిస్తూ.

రామ్మూర్తి ఆ నోటు అందుకొంటూ— "మీ సేఠ్‌గారు నిజాయితీగల వ్యాపారస్తుడోయ్! అందరూ అట్లా వుంటే లోకం బాగుపడుతుందోయ్. ఈ రోజుల్లో బిజినెస్ చేసేవాళ్లల్లో ఇంత నీతీ న్యాయాలు వున్నాయంటే నిజంగా చెప్పుకోవాల్సిందే! మీ సేఠ్‌గారికి నా థాంక్స్ చెప్పు" అన్నాడు రామ్మూర్తి.

— అంతేగానీ, సబ్బు పాకెట్ వూసెత్తలేదు రామ్మూర్తి.



ఆడుతూ, తలనెప్పి తగ్గకున్నా రిబ్బన్ విప్పేసింది భాను, రాధ గాబరా చూసి.

"నే వెళ్లకపోయినా బావుండిపోను. ఏమిటో బోల్డుమంది మనుషులు. అక్కడ వున్నంతసేపు ఎప్పుడు తిరిగి వచ్చేద్దామా అన్పించింది" అంది రాధ.

"అదేం ? వాళ్లంతా మాట్లాడుతూవుంటే నువ్వు బిగుసుకుపోయి కూర్చున్నావ్ అవునా !" అంది భాను.

"ఊఁ... పోనీలెద్దూ!" అంటూ, భాను తలకు రిబ్బన్ బిగించి కట్టడంవల్ల నుదుటిమీద పడ్డ గుర్తులు చూస్తూ, "బాగా వచ్చిందా భానూ ! ఏదైనా ట్యాబ్‌లెట్ తెప్పించుకోలేకపోయావా ? అసలు నేను వెళ్లకపోయినా బావుండిపోను." అంది రెండోసారి.

"ఇప్పుడేం జరిగిందని ? ఎవరెవరు వచ్చారూ? వాళ్లిళ్లు ఎలావుంది ?" అంది.

"నామొహంలా వుంది" అంది రాధ విసుగ్గా.

"ఇంత అందంగా వుందన్నమాట." అంటూ రాధ మొహంలోకి చూస్తూ నవ్వింది భాను. రాధ నవ్వలేదు. "పడుకో భానూ !" అంది.

"ఈ తలనెప్పి...కోసం యిప్పుడు పడుకుంటే జ్వరం వస్తుంది. సంధ్యవేళ పడుకుంటే జ్వరం వస్తుందని..."

"ఊఁ ... ఊరుకో ... " అంది నోరు మూసేస్తూ. రాధ కళ్లలో కదిలిన భయాన్ని చూస్తూ నవ్వేసింది భాను.

కాని ... మరో రెండు రోజులకల్లా, భానుకు జ్వరం బాగా వచ్చేసింది. రాధకు తెలిస్తే గాబరా పడుతుందని భాను చేసిన ప్రయత్నం ఫలించలేదు. ఒక రాత్రి అంతా భాను స్పృహలేకుండా పడి వుండడం చూసిన రాధ కంగారుపడిపోయింది. మర్నాడు భానుకు స్పృహ రాగానే రావుకు టెలిగ్రాం యిచ్చానని రాధ చెప్పడం చూసి విసుక్కుంది.

"ఈ నీ అమాయకత్వం భరించలేను అక్కయ్యా ! మామూలు జ్వరానికే యింత కంగారుపడిపోతారా ఎవరైనా ?" అంది.

"భానూ ! నీ నిర్లక్ష్యాన్ని కూడా నేను భరించ లేను" అంది రాధ.

"డాక్టరు వచ్చి, మందు యిచ్చాకా నాన్న వచ్చి చేసే దేమిటి ! వొట్టి గాబరా పడడం తప్ప."

"బావుంది ! డాక్టరు యిచ్చే ఆ మందుకు నీకు జ్వరం నయం అయినట్టే" అంది. భాను నవ్వుతూ చూసింది. అంత జ్వరంలోను తనను చూసి నవ్వుతున్న భానును చూసి చిరాకు పడి పోయింది రాధ.

"మెడిసన్ చదువుకొని, ఎంతో అనుభవం గల మంచి డాక్టరుకు విలువ యివ్వక యిలా మాట్లాడ్డం... నిజంగా విచారించదగ్గ విషయం" అంది భాను సీరియస్‌గా.

"ఆహాఁ... అంత అనుభవమే వుంటే జ్వరం తగ్గలేదేం ?"

"అక్కయ్యా ! నీది అమాయకత్వమో ! నా మీద అభిమానంతో యిలా మాట్లాడుతున్నావో కాని... ఈ మాత్రం మందులకే జ్వరం యింత

# అన్నపూర్ణ

(22వ పేజీ తరువాయి)

త్వరగా తగ్గిపోతే జ్వరం విలువేమిటి ?"

"ఊహూఁ... పది రోజులు చేదు మందులు త్రాగించి, మనిషిని అస్థిపంజరంలా చేస్తే అదో జ్వరం... అవునా ? నీకీ చేదు మందులు త్రాగడం ఆనందంగా వుంది కదూ !" అంది కోపంగా.

"మందే కాదు జీవితం చేదుగా వుంటుందట. మందు చేదుగా వుంటుందని త్రాగడం మానేస్తాం. మరి బ్రతకడం..."

"భానూ ! నువ్విలాటి మాటలు మాట్లాడకు" అంది. రాధ మాటలకు క్షణం సేపు రాధ మొహం లోకి చూస్తూ, "ఒక్క మాటడగనా అక్కయ్యా ! నేనంటే నీకు ప్రేమ ఎక్కువా ? లేక భయమా?"

"నా కలాంటి వేం లేవుగాని పడుకో !" అంది.

"నాకు తెలుసు ! నువ్వు సమాధానం తెలిసినా చెప్పలేవు. ఎందుకంటే... నేనంటే నీకు భయం. ఆ విషయం ఒప్పుకోవాలన్నా భయమే."

"వెర్రిగా మాట్లాడకు భాను. నువ్వు నాకన్నా చిన్నదానివి. నువ్వంటే నాకు భయం ఎందుకు ?"

"ఏమో ! కాని... ఈనాడు కాకున్నా ఒకనాడు ఒప్పుకుంటావ్ !"

"సంతోషించాంలే తెలివికి. నువ్విలా మాట్లాడుతూ వుంటే నేను వెళ్ళిపోతాను."

"ప్చ్... నువ్వు వెళ్ళలేవు అక్కయ్యా ! నేను వెళ్ళమన్నా వెళ్ళలేవు. వెళ్ళినా ఒక్క క్షణం వుండ లేవు" అంటూ నవ్వుతున్న భాను వంక నిస్పృహయంగా చూసింది రాధ.

రావు వచ్చేసరికి భాను జ్వరం తగ్గిపోయింది. చిక్కిపోయిన భానును చూస్తూ, "నాతో వచ్చేయ్ భానూ ! నాలుగురోజులుండి వచ్చేద్దువుకాని" అన్నాడు.

"తగ్గిపోయిందిగా నాన్నా ! ఇన్నిరోజులు కాలేజీకి వెళ్లలేదు. పరీక్షలు వస్తున్నాయ్. ఏకంగా పరీక్షలు అయిపోయాకా వచ్చేస్తాను."

"వెధవ పరీక్ష ! యిప్పుడు రాత్రుళ్లు కూర్చుని చదివి రాయకపోతేనేం ?"

"వెనక్కివెళ్లిన కాలం తిరిగిరాదు నాన్నా !"

భాను మాటలకు ఉలిక్కిపడిపోయాడు. భాను మొహంలో అన్నపూర్ణ నవ్వింది.

పరీక్షలు అయిపోవడంతోనే, బయలుదేరారు రాధా, భాను.

"మీరిద్దరూ త్వరగా రండి. ఇల్లు మరీ చిన్నబోయింది. ఈ సెలవురోజులన్నా నాదగ్గర గడపండి" అంటూ రావు ఉత్తరం రాసాడు. రుక్మిణి, సత్యకూడా రమ్మంటూ రాసారు. ప్రత్యేకించి సత్య "భానూ నిన్ను చూడాలనివుంది చెల్లి" అంటూ రాయడంతో రెండురోజులు యిద్దరూ, చెరొకరి దగ్గర గడిపి తండ్రి దగ్గరికి వెళ్లిపోవడానికి నిశ్చయించుకొన్నారు.

ఆ సాయంత్రం బజారుకెళ్లి కావలసిన వస్తువులు కొనుక్కొని తిరిగి వస్తూవుండగా, "రాధాదేవి గారూ !" అన్న పిలుపు వింటూనే రాధా, భాను ఉలిక్కిపడి చూసారు. ప్రక్కనే ఆగిన అందమైన కారులో నుండి దిగిన యువకుడ్ని చూస్తూనే రాధ నిస్తపోయింది. భానును ఆశ్చర్యపోతూ చూసాడు. అతడు భాను నంతగా పట్టించుకోలేదు.

"పరీక్షలు ఎలా రాసారూ ?" అన్నాడు.

"బాగానే రాసానండి !" అంది తలూపుతూ. భాను అర్థంకానట్టు మూడ్డం చూసి, రాధ పరిచయం చేయదేం అన్నట్టుగా చూస్తూ... "వీరు" అంటూ ఆగిన అతని మాటలకు, "నా పేరు భాను. రాధ చెల్లెల్ని" అంది.

"ఓ ... నమస్తే" అంటూ నవ్వి, నేను సుజాకు వరసకు అన్నయ్యనవుతాను" అంటూ భాను నూటితత్వానికి బిత్తరపోతూ,రాధకు, భానుకు రూపంలో మాటలో ఏమాత్రం పోలిక లేకపోవడం చూసి ఆశ్చర్యపోయాడు. ఐదు నిమిషాలు నిలబడ్డా కొయ్యబొమ్మలా బిగుసుకున్న రాధ ఏం మాట్లాడక పోవడంతో, భాను, ఇబ్బందిగా కదులుతూ, "వెడదామా !" అంది.

"హాస్టల్‌కేగా ! రండి డ్రాప్ చేస్తాను." అన్నాడతను.

"థ్యాంక్స్ ! ఫర్వాలేదులెండి ! మాక్కాస్త బజారు పని వుంది. వెళ్లాలి" అంది భాను. అతను రాధ వంక చూసాడు. అప్పుడే తలెత్తి అతనివంక చూసింది రాధ.

"మరి నే వెళ్తానండి !" అన్నాడతను చేతులు జోడిస్తూ.

"అతని పేరేమిటి ?" అంది భాను అతను వెళ్లిపోయాకా. ఆలోచిస్తూ నడుస్తున్న రాధ ఉలిక్కిపడి, "ఏమో ! ఆరోజు సుజాత యింటికి వెళ్లాను చూడు ... అక్కడున్న చాలామందిలో ఇతడొకడు. ఆరోజు సుజా పరిచయం చేసింది. కాని పేరు గుర్తులేదు" అన్న రాధ కళ్లముందు ఎవరిదో అందమైన మొహం కదలాడింది.

"ఓహ్..." అంటూ ఫక్కున నవ్వి, "పేరు గుర్తు లేదు. మనిషి గుర్తున్నాడు కదూ !" అతడు పిలిచి పలకరిస్తే బుద్ధావతారంలా తల వాల్చుకు నిలుచుంటావేం" అంది.

"ఏం మాట్లాడాలి?" అంది గొణుక్కుంటు న్నట్టుగా. రాధ జవాబుకు "ఏం మనిషిరా బాబూ!" అనుకుంటూ జాలి పడిపోయింది భాను.

(ఇంకా వుంది)

## ఇంటింటి చిట్కాలు

★ ఉల్లిపాయలు తరిగిన తరువాత, కత్తిమీద నిమ్మకాయ తొక్కతో రుద్దితే వాసన వుండదు.

★ నెయ్యి ఎన్ని రోజులయినా తాజాగా వుండాలంటే, నెయ్యి సీసాలో, చిన్న బెల్లపు ముక్క వేస్తే, రుచి, వాసనా బాగుంటుంది.

★ చింతపండులో వేడి నీళ్ళు పోసి, ఆ గిన్నె చల్లటి నీళ్ళలో పెట్టి చింతపండు పులుసు పిండితే, తొందరగా పులుసు తయారవుతుంది.

★ పచ్చి మెరపకాయలు పండిపోకుండా వుండాలంటే, శుభ్రమైన సీసాలో, పచ్చి మెరపకాయలతో పాటు కొద్దిగా పసుపు వేసి, మూత గట్టిగా బిగించి దాన్ని వంటింటి కిటికీలో పెట్టండి.

— ప్రభామూర్తి

## ౬

'ఏయ్ చస్తావా ఏమిటి?' కారుహారన్

'బొయ్'మని-డ్రైవరు హెచ్చరింపు-

నడిరోడ్డు మీది నుండి తూలుకుంటూ

ోడ్డుపక్కకు దూకాను-

వెంట్రుకవాసిలో ప్రాణాపాయం తప్పింది

వెధవప్రాణం-

ప్రాణమేమిటి? అపాయమేమిటి??

అసలు నేనే చస్తే ఎంత బాగుండును.

ఇదో కొత్త ఆలోచన-

'చావాలి'అన్న భావంలోకూడా ఇంత'థ్రిల్' ున్నట్లు ఇప్పుడే గమనిస్తున్నాను-

స్వామీజీ అప్పడే చెప్పాడు ఇలాంటిబజారు ురుకుతో సంబంధం పెట్టుకోవద్దని-

దాని ఇంటికి పోవద్దని ఆయన నిషేధిం ుంది అందుకే-

నిజమే! ఇదేమి సతీసావిత్రా, సీతామహా ాద్వా?

అర్ధాంగితో ప్రవర్తించినట్లు దాని మీద ుధికారం చెలాయిస్తే ఎలా కుదురుతుంది??

పెళ్లికిముందు నాతో అలా తిరిగింది. ుంొకడితోనూ, అలాగే సరసాలు కులుకు ుందని ఊహించలేకపోవడం నాదే పొరపాటు-

యూనివర్సిటీ గేటు చేరాను.

ఎక్కడో బస్సులు రెండు విద్యార్థులు ుంటించిన వార్తలు.

బయట మంటలు

నా మనస్సులోనూ మంటలు-

విశ్వాస పాత్రుడైన, దాసుడు నటరాజన్ ుంతటి కల్లోలంలోనూ స్వామీజీ దర్శనానికి ాబోలు వచ్చినట్లున్నాడు గేటు దగ్గరే ులబడి వున్నాడు

నన్ను చూడగానే గబ గబ నడుస్తూ ుగ్గరికి వచ్చాడు-

'నటరాజన్! స్వామీజీ వున్నారా గదిలో'

'వున్నారు - కాని మీరొకసారి నాతో ూళ్ళోకి రావాలి'

'ఎందుకు?'

'చెపుతాను-'

'నాకు కొంచెం పని వుంది-'

'ఆత్మహత్యేగా! దానికేం బోలెడంత జీవితం వుంది-ఎప్పుడైనా ఈ పనికి తీరిక ొరుకుతుందిలే' నటరాజన్ కంఠంలో ుెనుకటి సౌజన్యమూ, సౌమ్యతాలేదు-చాలా ురుకుగా కటువుగా వుంది.

(గత సంచిక తరువాయి)

ఆత్మహత్యా భావం నాకు వచ్చి ఇంకా పదినిమిషాలు కూడా కాలేదు - ఇతనికెలా తెలిసింది.

నేను మాట్లాడకుండా అతన్ని తప్పించు కొని లోపలికి వెళ్లబోతున్నాను

ఇద్దరు పోలీసులు నన్ను చుట్టుముట్టారు. నేను నిర్విణ్ణునయిపోయాను-

'మంచిగా నాతో వస్తే మంచిది కిరణ్ కుమార్. లేకుంటే బేడీలు తగిలించి తీసు కెళ్లాల్సి వుంటుంది.'

'నేనేం చెయ్యలేదు- మాధవిని హత్య చెయ్యను-నేనెందుకు చేస్తాను?'

'నీవు చెయ్యవు-చెయ్యలేవు కూడానులే- ఆత్మహత్య చేసుకోవాలనుకున్నావుగా- అది చాలు పద పోలీసు స్టేషనుకు-'




డా. ముదిగొండ శివప్రసాద్

నటరాజన్ మఫ్టీలో వున్న పోలీసు అధికారి అనీ సి. ఐ డీ. అనీ ఇప్పుడే గుర్తించ గలుగు తున్నాను. పోలీసు వాన్‌లో ఎక్కించారు-

విశాఖ పోలీసుస్టేషనుకు తీసుకువెళ్లారు-

అక్కడ ఒక డాక్టరు మా కోసమేనన్నట్లు ఎదురు చూస్తున్నాడు-

రాగానే నన్ను పట్టుకొని గదిలోకితీసుకెళ్లి ఏవేవో పరీక్షలు చేశాడు-ఓ ఇంజెక్షనిచ్చాడు- గట్టిగా నిట్టూర్చి బయటికివచ్చి 'ఫరవా




లేదు హి, విల్‌బి ఆల్‌రైట్' (ఇతడు బాగు పడతాడు) అని చెప్పాడు పోలీసు అదికారితో-

'మిస్టర్ కిరణ్‌కుమార్-మీ కేది కావాలో చెప్పండి-ఏర్పాటు చేయిస్తాను-భోంచేస్తారా, కాఫీ తీసుకుంటారా?'

'ఏమీవద్దు-నేను నిర్దోషిని-ఎవరినీ చంపాలనుకోలేదు-వదలండి'

'కనీసం చావాలనుకున్నావు కదా'

'అనుకోవడంకూడా నేరమేనా?'

## చిదంబర రహస్యం

'ప్రివెన్షన్ ఈజ్ బెటర్‌దాన్ క్యూర్' (రోగనివారణ రోగ నిదానంకన్నా మంచిది)

'పోలీసు శాఖ మనుషుల మనస్సుల్లోకి దూరడం ఎప్పుడు మొదలు పెట్టిందేమిటి?'

'మీరు ఆవేశంలో వున్నారు — వెళ్లి విశ్రాంతి తీసుకోండి' అది విశ్రాంతికాదు— బంధించడం అన్నమాట—

నన్ను తీసుకెళ్లి ఓగదిలో పడేశారు—

బయట కాపలా, నేను ఏ అఘాయిత్యమూ చేయకుండా! రాత్రి అదోరకమైన నిద్ర పట్టింది—

తెల్లవారాక నటరాజన్ వచ్చాడు—

'హల్లో మిస్టర్ కిరణ్‌కుమార్— కుశలంగావున్నారా' నేనేం మాట్లాడలేదు—

'సారీ— ఫర్‌ది ట్రబుల్ కాజ్‌డ్ బై మి (నేనిచ్చిన కష్టానికి క్షంతవ్యుణ్ణి)

"... ... ... ..."

మీరు ఇవ్వాళే హాస్టల్‌కి వెళ్లవచ్చు భోజనం వేళకు— మీరు తీసుకున్న మూలికా ప్రభావం నిన్న డాక్టరుగారిచ్చిన ఆంటీడోటలో నశించింది లెండి—'

'ఏం మూలిక—'

'అదే స్వామీజీ ఇచ్చిన విషం'

'అది విషమా ?'

'అని కొంచెం ఆలస్యంగా నిర్ధారించుకున్నాను— ఆ నిర్ధారణ జరిగేటప్పటికి మీరు తినడమూ, మాధవిని హత్య చేయాలనుకోవడమూ ఇన్నీ జరిగిపోయాయి—'

'స్వామీజీ విషం ఇచ్చారా ?'

'విషమిస్తే అదృష్టవంతుడివే — దెబ్బకు చచ్చేవాడివి— ఇది అంతకన్నా ప్రమాదకరమైంది— మతి భ్రంశం కలుగజేసి నిలువునా క్రుంగదీసి పీల్చి పిప్పిచేసి మరీ చంపుతుంది— స్వామీజీ ఇచ్చే ప్రసాదాలన్నీ ఇవే— హైపొటెన్సీలో విషాలూ, మార్ఫియాలు, గార్డినాల్స్ ఇలాంటి అడవి మూలికలు—'

'మీరు చెప్పేది నాకు అర్థంకావడంలేదు'

'నీకేమిటిబాబూ మాకు అర్థం కావడానికే ఓ యాడాది పట్టింది— పాత్రో, ముఖర్జీ, స్వామీ, వీళ్లంతా విద్యార్థులుకారు — ఒక దేశపు ఏజంట్లు. విశ్వ విద్యాలయాలలో ప్రవేశం వాళ్ల వ్యూహంలో ఒక అంతర్భాగం వాళ్ల నాయకుడు చిదంబరరావు నిర్ణీతమైన పథకం ప్రకారం ఈదేశంలోని మేధావి వర్గాన్ని ముఖ్యంగా దేశానికి పనికివచ్చే తెలివైన విద్యార్థులను నిర్మూలించడం ఈ కార్యక్రమంలోని ప్రధానాంశం వాళ్లను చదువునుండి పక్కకు మళ్లించడం, విషయలోలురుగా మార్చడం, వ్యసనాల కలవాటు చేయడం, మతిభ్రమణం కలిగించడం, హత్యలు ఆత్మ హత్యలు ప్రోత్సహించడం. వాళ్ల కార్యక్రమాలు—హిప్పీ కాంపులు, మార్ఫియాలు; మాధవీ చంద్రమ్మలు వాళ్లు విద్యార్థులపైకి చేసే ప్రయోగాలు. మిసెస్ ఆల్‌ఫ్రెడ్‌వంటి వాళ్లంతా ఇందులో క్రిష్టిన్‌కేలర్ పాత్రను నిర్వహించే వన్నెల విసనకర్రలు— ఈదేశంలోని 'క్రీమ్ ఆఫ్‌ది సొసైటీ' విశ్వవిద్యాలయాలలో వుంది— అక్కడ అల్లర్లు లేపడం సమ్మెలు చేయించడం అరాజకాన్ని వ్యాపింప చేయడం వాళ్ల ధ్యేయాలు. మేధావి వర్గాన్ని నిర్మూలిస్తే మిగిలిన అవిద్యావంతులనూ సామాన్య మానవులనూ వందల సంవత్సరాలు బానిసలుగా చేయడం శత్రువులకేంకష్టం ? ఆ పద్మవ్యూహంలో నిష్కారణంగా చిక్కుకున్న బలహీనుడివి నువ్వు, కిరణ్ కుమార్-ఇందులో నీ తప్పేమీ లేదని నాకు తెలుసు.

'చిదంబరరావు గారిని... ...'

*జరిగిన కథ:* యూనివర్శిటీ విద్యార్థి చిదంబరరావు కొన్ని మానవాతీతశక్తులను కలిగి ఉన్నాడని తోటి విద్యార్థి అయిన కిరణ్‌కుమార్ క్రమేణా నమ్మి అతనికి సన్నిహితు డవుతాడు. నర్సు మాధవి ఆహ్వానంపై ఆమె ఇంటికి వెళ్లిన కిరణ్ కుమార్ ఆమె తల్లి గుడ్డితనాన్ని గురించి తెలుసుకుంటాడు మాధవిని ప్రేమించి ఆమెతో విహరిస్తుంటాడు కిరణ్. ఆల్‌ఫ్రెడ్ దంపతులను మాధవి అతనికి పరిచయం చేస్తుంది. తిరుగుళ్ళు మానమని స్నేహితుని హెచ్చరిస్తాడు రెడ్డి. మాధవి యింటి కరెంటు బిల్లు కట్టడానికి రెడ్డి పెట్టెలో డబ్బు దొంగిలిస్తాడు కిరణ్. ఒక డాక్టరుతో మాధవి వున్న ఫొటో చూసిన కిరణ్ కుమార్‌కు పిచ్చెక్కినట్లవుతుంది. స్వామీజీ ఇచ్చిన మూలికను తిన్న కిరణ్ తన శక్తిని కోల్పోతాడు విద్యార్థులు సమ్మె ప్రారంభిస్తారు.

# * యువతరం *

వినకొక జాతీయ క్రీడలాంటిదేదీ లేదన్నది తన అభిప్రాయంగా చెప్పిన డి. అమరేశ్వర శర్మ బి. కామ్. చదువుకుంటున్నాడు. విజయవాడలోని కమర్షియల్ టైపు యిన్‌స్టిట్యూట్స్ వారు నిర్వహించిన టైపు రైటింగ్ హయ్యర్ పోటీలలో సిల్వర్ మెడల్ సంపాదించుకున్నాడు.



రూపాయికి చిల్లర దొరక్కపోతే ఏంకొని మార్చుకుంటావు? అంటే 'సోడా త్రాగి' అన్నాడు. శ్రీమతి యిందిరాగాంధీ గారంటే తెలివైన పట్టుదల గల ప్రధాని అని తాఖీదు యిచ్చిన శర్మ బియ్యం తప్ప మార్పు కోసరం గోధుమ అన్నం తిన లేనన్నాడు.

సినిమాలు చూస్తాడు విరివిగా. వూళ్లో నడిచే అన్ని ప్రాంతాలకి తిరుగుతాడు. పత్రికల్లో కార్టూన్ల కోసం ముందు వెతుక్కుంటాడు మంత్రుల్ని చూశాడు అవసరం లేకపోయినా. సినిమా స్టార్‌లంటే ''క్రేజ్'' లేదుట; 'క్రికెట్' హాబీ, కామెంటరీకి చెవి కోసుకుంటాడు. ఫస్ట్‌క్లాస్‌లో ప్యాసై మంచి వుద్యోగం చేసి ఆదర్శవంతంగా వుండాలని కోరికలు గల యీ యువకుడు బ్లాకు మార్కెట్‌లో సినిమా టిక్కెట్ ఏ మాత్రం కొనడు. క్యూలో నించొని కొంటాడు. 'వాళ్ల కాలేజీకి 'ప్లేగ్రవుండే' లేదు. అయినా ''స్పోర్ట్స్'' మీద సరదా కొద్దీ—ఆ పుస్తకాలు చూసి ఆనందిస్తాడు. ''మంచివాడు ధూళిపాళ అమరేశ్వర శర్మ'' అన్న పేరు కోసం ప్రయత్నించుతాడు.-బెటర్‌లక్.

[ వీ రా జీ ]

'అరెస్టు చేశాము — కావాలంటే చూడవచ్చు నువ్వు — అంతేకాదు పుచ్చపువ్వుల్లా కళ్ళు తెరుచుకుని ఈపాపాలన్నిటినీ చూస్తున్న కమలమ్మ పురఫ్ చంద్రమ్మను కూడా నువ్వు చూడవచ్చు — మీ విశ్వ విద్యాలయంవారు చాలా తొందరగానే మేల్కొన్నారు— కాబట్టే వారి సుహృద్భావంతో చాకచక్యంతో మేమీ విషవ్యూహాన్ని ఒక ఏడాదిలోగానే భేదించగలిగాము—అందుకు వారికి మా. సి. బి. ఐ. అధికారులంతా కృతజ్ఞులం'

నటరాజన్ సి. ఐ. డి. కాదు సి. బి. ఐ. అధికారి అన్నమాట !!

నాకెందుకో దుఃఖం పొర్లుకొచ్చింది—

కాలుకింది భూమి కరిగిపోతున్నట్లు ఒకవైపూ, కారు మేఘాలు కదిలిపోతున్న ఆకాశం మరొకవైపూ కనిపించాయి—అనిపించాయి—

'చిదంబరరావు గారి మాహాత్మ్యాలు' ... అనుమానంగా ప్రశ్నించాను—

'చూడు కిరణ్—'లాల్ మా యా జాల్' ప్రదర్శన చూడలేదూ నువ్వు—ప్రపంచ ప్రసిద్ధి చెందిన 'సర్కార్' పేరు వినే వుంటావుకదా! స్టేజీ మీద తలలూ మొండెమూ చేతులూ కాళ్ళూ వేటికవి ముక్కలు ముక్కలు చేసి ఆడియన్సు మీదికి విసిరేసి మళ్లీ మరుక్షణంలోనే మనిషిని బ్రతికించి నడిపించేవాడు సర్కార్! సర్కార్ కన్నా గొప్పవాడంటావా చిదంబరరావు?'

తలతిరుగుతున్నట్లనిపించింది.

చేతితో గట్టిగా నుదురు పట్టుకొని ఒక్క క్షణం ఆగి తెప్పరిల్లాను—

జేబులో వున్న ఫోటో గుర్తుకొచ్చింది—తీసి నటరాజన్ చేతికిచ్చాను—

చూచి నిట్టూర్చాడు 'పాపం కింగ్‌జార్జిలో ఫేమస్ కార్డియాలజిస్టు ఇతను. ప్రభుత్వ సహాయంతో హార్ట్ ట్రాన్స్‌ప్లాంటేషన్ (గుండెలు తీసి కొత్త గుండెలు అమర్చడం)లో విప్లవం సాధిస్తానని ఛాలెంజి చేసిన మేధావి. ఇతనికిప్పుడు మతి భ్రమించింది. ఇతని గుండె పైనే విష ప్రయోగం జరిగింది. రాయి వెల్లూరు పంపారు మొన్న.'

'ఇన్నాళ్లు మీరేంచేస్తున్నట్లు' ఆవేశంతో అరిచాను.

'దేనికైనా సమయం రావాలి కిరణ్ నిజం చెప్పాలంటే మన తెలుగు దేశంలో ఈ ఘోర ప్రమాదాన్ని మొగ్గలోనే త్రుంచివేశాము. కాని యితర విశ్వవిద్యాలయాల మాటేమిటి? విదేశీ విద్రోహుల ప్రేరణతో వ్యభిచార గృహాలుగా మారిన వుమెన్స్ హాస్టల్స్, మందుగుండు కర్మాగారాలుగా మారిన విద్యార్థుల గదులు—ఎన్ని వున్నాయో —ఇంకా ఎంత సమాచారం బయటికి రావాలో ...ఏమైతేనేం నువ్వుమాత్రం అదృష్టవంతుడివి కిరణ్ - నిన్ను మధ్యాహ్నమే విడుదల చేసేము వెళ్లి, శ్రద్ధగా చదువుకో. మాకు కావాల్సిన వివరాలు కొన్ని చెప్పివెళ్ళు చాలు.'

నటరాజన్‌కు చెయ్యెత్తి నమస్కరించాను—

నటరాజన్ నా గది దగ్గరి నుండి వెళ్లిపోయాడు.

అన్నట్లే మధ్యాహ్నానికి నన్ను వదిలి పెట్టారు.

అధికారులు అడిగిన అనేకమైన ప్రశ్నలకు ఏమీ దాచుకోకుండా జవాబులు చెప్పాను.

పోలీసు అధికారి చిరునవ్వు నవ్వుతూ 'చిదంబరరావు డైరీ దొరికింది' అని చెప్పి ఓ చిన్న పాకెట్ డైరీ తీసి అందులో నాలుగు కాగితాలు తిప్పి ఓ పేజీ నాకు చూపించాడు; అందులో ''వెంకటరెడ్డి'' అని మాత్రం వ్రాసివుంది ఇంగ్లీషులో—

'అంటే-' అయోమయంగా ప్రశ్నించాను.

'అంటే నీ తర్వాత ప్రయోగం అతని మీద నన్నమాట' నటరాజన్ ఒకే మాటలో వివరించారు దాని అర్థాన్ని!

(అయిపోయింది)



# చిదంబరం

మానస

"గురూ ...! ఓ పదుంటే సర్దు, వస్తూ ఇచ్చేస్తాను."

"లేవు"

"సరేలే." అంటూ వెళ్లిపోయాడు చిదంబరం.

"ఈ మనిషింతే. ఇక బాగుపడడు 'తనకు దూరదొంకలేదు; మెడకో డోలన్నట్టు' అన్నీ తన నెత్తిమీద వేసుకుని తిరుగుతాడు." భూషణం మనసులో అనుకోడమే కాదు, బైటిక్కూడా అనేశాడు.

"ఎవరు గురూ ... ?" అప్పుడే సీట్లోకి వచ్చిన నాగరాజు అడిగాడు.

"ఇంకెవరు, మన చిదంబరం గాడే! ఓ పదుంటే సర్దు గురూ...!అంటూ వచ్చాడు"

"పాపం నిజంగా అవసరం ఉండె వచ్చాడేమోరా ?"

"అవసరమా, వాడి బొందా? 'బాబూ సాయం చెయ్యరా' అంటూ ఏ పోతురాజో, ఏ అప్పలస్వామో .. ఏ మస్తాన్ గాడో చెయ్యి జాపి ఉంటారు. వాళ్లకో అభయ హస్తం పడేసి, మరో ముష్టి చెయ్యి మనవైపు విసిరాడు"

"అయితే భూషణం ...! ఒకడ్ని ఆదుకోవాలంటే తను పదిమంది దగ్గర యాచించకూడదు అని వాడికి స్ఫురించదంటావా ? "

"ఆలోచనా, పాడా ! అవుంటే ఏ నాడో బాగుపడేవాడోయ్ నాగరాజా ! అయినా ఒక్క మాట చెబుతా, విను ; పీడు బ్రతికేది ముష్టి బ్రతుక్కీ అయినా..., 'ధర్మదాతా,"

"అదికాదు సార్ !"

"ఏదికాదు ? చూడు చిదంబరం ! మానవసేవా అంటూ అనాధ శరణాలయాల చుట్టూ మాధవసేవా అంటూ గుళ్లూ గోపురాల చుట్టూ, జంతుసేవా అంటూ గొడ్ల శాలల చుట్టూ తిరిగితే...ఉన్నది ఊడ గొట్టుకోవడమే గానీ, కానీకూడా కిట్టదయ్యా వాటివల్ల ఏదో ఒకరోజు వెళ్ళాలంటే ఏదో అఘోరించు. ముందు వెళ్లి ఆ ఫైల్సన్నీ డిస్పోజ్ చెయ్యి...!"

* * *

"గురూ...కామేశ్వరావ్ ! ఓ పదుంటే ఇస్తావా ? జీతాలకి ఇచ్చేస్తాను."

"చూడు బాబ్జీ... ! డబ్బులుంటే చూడాలి. లేకపోతే మానెయ్యాలి. అందరూ ఎగబడు తున్నారని మనమూ ఎగబడితే, పులిని చూసి నక్క వాతలు పెట్టుకున్నట్లు అవుతుంది. డ్యాన్స్ ప్రోగ్రాం చూడు. కాదనను. చూస్తున్నంతసేపూ ఆనందంగానూ,హాయిగానే ఉంటుంది. కానీ అప్పచేసి చూస్తే... ఆ అప్పు తీర్చాల్సొచ్చినప్పుడు బాధుంటుందే, దానిముందు, ఈ డ్యాన్స్ ప్రోగ్రాం తాలూకూ ఆనందం, హాయీ అంతా దిగదుడుపే గురూ ! ఆ బాధ భరించలేవు. ఏమంటావు ? అయితే ఒక్కమాట : సుబ్బారావు గాడు టిక్కట్టుకొని ఊరెళ్లిపోయాడు. ఆ టిక్కెట్ నాదగ్గరుంది. నువ్వు కావాలంటే చెప్పు; ఎనిమిది రూపాయల కిచ్చేస్తాను."

"టిక్కెట్ కోసం కాదు గురూ... మన మస్తాన్ 'చాలా జరూరీ సాబ్,' ఓ ఐదిప్పించరూ' అని దీనంగా అడిగాడు. పాపం ఏం కష్టాల్లో ఉన్నాడో, అందుకని."

"చూడు చిదంబరం...! కష్టాలు మనుషులకి కాకపోతే, మానులకే,దున్నపోతులకీ గోడలకీ వస్తాయా !

కష్టాల్లో ఉన్నవాళ్ళని జాలిపడి ఆదుకోవడం మానవ ధర్మమేగాని... జాలికీ, మొహ మాటానికీ లొంగిపోయి ఏదో రాసుకోడంలో మునిగి పోయాడు.

"ఇవాళరాత్రి నీకేదైనా ప్రోగ్రాముందా?"

'ఉంది. దేవుడెదురైనా ఎప్పాయింట్ మెంట్ఇచ్చేది లేదివాళ.ఎన్నాళ్ళనుంచో ఎదురు చూసిన డాన్స్ ప్రోగ్రాంకి వెళ్ళితీరాలి."

"సరేలే" వస్తాను.

చిదంబరం వెళ్ళిపోయాడు.

వెళ్ళిపోతున్న చిదంబరాన్ని చూస్తూ "చేతిలో కానీ లేకపోయినా కోరికలకేం లోటు లేదు. సుబ్బలక్ష్మి పాడిన త్యాగరాజు కీర్తన లంటే చెవులు కోసుకుంటాడుట. ద్వారం వారి వైలెను వింటుంటే భోజనమే అక్కర్లేదుట. పాతసినిమాల్లో పాటలు వింటుంటే ఎంత హాయిగా ఉంటుందో చెప్పలేదుట . దొరకగా దొరకగా వీడికి నా టేపురికార్డరే దొరికింది."

– 'నీ కివాళేదైనా ప్రోగ్రాం ఉందా గురూ' అన్నప్పుడు పొరపాటున 'లేదు' అన్నానంటే, అయితే ఇవాళ రాత్రి నేను వస్తాను. హాయిగా టేపురికార్డరు పెట్టుకుందాం అంటూ బోరేస్తాడు అవకాశం దొరికినప్పుడల్లా !

అంత టేపురికార్డరంటే ముచ్చట పడేవాడు ఓ వెయ్యి పారేసి కొనుక్కోవచ్చుగా ! అహఁ ఆపని మాత్రం చెయ్యడు!" తన సహజ ధోరణిలో భూషణం నాగరాజు నుద్దేశించి చెబుతూ ప్రక్కకి తిరిగి చూశాడు.

నాగరాజు సీట్లో లేడు.

"సాబ్ ఓ ఐదుంటే ఇప్పించరూ !"

"లేవు" అని అనడమేకాదు; భూషణం మండిపడ్డాడుకూడా !

"చాలా జరూరీ సాబ్... ఫస్ట్ తారీఖ్కి చ్చేస్తాను."

"లేవని చెబితే వినాలి మస్తాన్‌భాయ్ ! ఇందాక చిదంబరంవచ్చి అడిగితేనే లేవన్నాను. ఉంటే ఇవ్వనూ...?"

శిబి చక్రవర్తి 'అనిపించుకోవాలను కుంటాడు. అదే వాళ్ళకుంట...!''

''నువ్వేమైనా చెప్పుగురూ...! చిదంబరం అంటే పరమ జాలి నాకు.. వాడేదో కష్టాల్లో ఉండో ... లేక మరొకడి కష్టం తీర్చడానికో నిన్ను ముస్తెల్తి ఉంటాడు. అది వేరే విషయం ..! మామూలుగా ఆలోచించు: వాడు లేందే ఏ పనైనా జరుగు తుందా...?''

ఆఫీసులో ఎవడికైనా పంచదార కోటా కావాలంటే వాడే! బియ్యానికి పర్మిట్లు తేవాలంటే వాడే! ఎవడికైనా కొంప వెతికి పెట్టాలంటే వాడే! కాలేజీలో సీట్లు సంపాదించాలంటే వాడే! ఆఫీసులో ఎవర్నైనా పమర్దించాలంటే వాడే! ఎవడు చేసిన వార పాటుకైనా, తప్పుకైనా ఆఫీసరు చేత చివాట్లు తినాలంటే వాడే! ఆస్పత్రుల చుట్టూ తిరగాలంటే వాడే! పై నుంచి ఏ గాడిదకొడుకైనా దిగుతున్నాడంటే, స్టేషన్ దగ్గర కావలాగా కూడా వాడే! దీనికీ దానికీ అంటూ ప్రత్యేకత ఎందుకు? అన్నింటికీ వాడే కావాలి...! మళ్లీ వాడంటేనే కదూ మంట అందరికీ''

''కొందరి జీవితాలు అంతే నాగరాజా! ఉయ్ కాంట్ హెల్ప్‌దెమ్ !''

* * *

''సార్! ఇవాళ కొంచెం త్వరగా...''

''వెళ్లిపోవాలి. అంతేకదూ...!''

''అవునుసార్! కొంచెం పనుంది.''

''ఏ రోజయ్యా చిదంబరం, నీకు పని లేనిది? అడగడానికైనా సిగ్గుండాలయ్యా! ఓ ప్రక్కన మార్చి నెలాఖరు వచ్చేస్తోంది. పాస్ చెయ్యవలసిన బిల్లులన్నీ పెండింగ్‌లో ఉండిపోయాయి. మధ్యలో నీకు పనేమున్నా...? పెళ్లేడు'' అర్థం కేంది. కానీ రోజూ పోవాలనుకుంటే ఇక్కడ ఆఫీసు పని ఎవడు చేస్తాడయ్యా? ఆ మాత్రం జ్ఞానం ఉండద్దా?''

'అదికాదుసార్! ఇవాళ తొమ్మిదింటికి...'

''తొమ్మిదింటికేనయ్యా ఆనరాలో డ్యాన్స్ ప్రోగ్రామ్...''

''సార్ మీరు కూడా వెళ్తున్నారా ప్రోగ్రామ్‌కి?''

''వెళ్లనయ్యా, పదేసి రూపాయలు పెట్టి టిక్కట్లు కొన్నందుకు? నేనూ,మా ఆవిడా— ఇద్దరం వెళ్తున్నాం ...! ఊఁ ఊఁ ఇంకా నిలబడటం దేనికి? అంత నువ్వూ వెళ్లాలను కుంటే తొందరగా పని తెముల్చుకుని ఏ ఎనిమిదింటికో పోరాదూ?''

''అలాగేసార్! ఎనిమిదింటి లోపే పని పూర్తిచేసుకుని వెళ్తాను.''




మాటానికీ, మంచితనానికీ తట్టుకోలేనిది మనీపర్సబ్బాయ్! వెళ్ళిరా!''

''ఏరేలే వెళ్తామగా?... నువ్వు డాన్స్ ప్రోగ్రామ్‌కి వెళ్తున్నావా?''

'పడిపోసుకో ఇరవైకో మంచిబేరంవస్తే ఈ టిక్కెట్టు అమ్మటానికైనా ... ఎవడూ దొరక్కపోతే, వేస్ట్ చెయ్యకుండా నేనే చూద్దామనికైనా...; దేనికైనాసరే తొమ్మిదింటికి నేను అక్కడ ఉండాల్సిన అవసరం ఉంది బాబ్జీ...!''

''అలాగా! అయితే, వస్తాను గురూ...!''

''నీదే ఆలస్యం...!''

* * *

''భూషణం...!''

''భూషణం తలెత్తి ఏమిటి అన్నట్టు చిదంబరాన్ని విసుగ్గా చూసి, తలదించుకున్నా

''చిదంబరం సాబ్ మీదగ్గరకి వచ్చారా సాబ్! పాపం నాస్తరించే అడిగుంటారు తమర్ని. మాఫ్‌కీజియే! వస్తాసాబ్!'' అంటూ వెళ్ళిపోయిన మస్తాన్ ఓ పదినిమిషాలు ఆగి డ్యూటీదిగి ఇంటికి వెళ్ళిపోతూ భూషణం దగ్గరకువచ్చి, 'సాబ్, తమకు వీలైతే రండి సాబ్! ఇవాళ రాత్రి తొమ్మిదింటికి వెంకటేశ్వరుడి గుళ్ళో చిదంబరం సాబ్‌కి పెళ్ళి—

ఈ సంగతి నాకు ఐదింటికే తెల్సింది. పిన్నోసార్లు నన్ను కాపాడిన సాబ్‌కి ఏదైనా ఇద్దామని అనుకునికూడా, పైసాలేక 'సాబ్'నే అడిగాను ఓ ఐదు రూపాయల అప్పు. 'లేదని' చెప్పడానికి చాలా 'ఇదైపోయాడు' చిదంబరం సాబ్''అని చెప్పి ఆఫీసు ఎదురుగా ఆగినబస్సు ఎక్కడానికి వడి వడిగానడిచేసరికి ...

''...ఏ వన్నావ్, చిదంబరం పెళ్ళా? మస్తాన్ భాయ్, ఆగాగు—! ఇది నీదగ్గ రుంచు'' అంటూ జేబులోంచి కొన్ని నోట్లు తీస్తూ మస్తాన్ వెనకాలపడ్డాడు భూషణం!

ఆవేళ రాత్రి గుళ్లో బ్రహ్మాండమైన వెంకటేశ్వరుడి కల్యాణంతోపాటు... అనాథలై ప్రేమసమాజం ఊతతో జీవితాన్ని సాగిస్తున్న మరి పదిమంది పేద కన్యలకి ఒకానొక ధర్మదాత అతి నిరాడంబరంగా కన్యాదానం చేయబోతున్నాడనీ...అందులో తానొక దానగ్రహీత అవబోతున్నాడనీ... వీలుంటే తప్పక దయ చెయ్యవలసిందనీ...చిదంబరం కనీసం ఆహ్వానించడానికి కూడా అవకాశం ఇవ్వని అతని సహోద్యోగులంతా, ఎవరు పిలిచారనో తెలీదు; ఒక్కళ్ళు కూడా మిస్ కొట్టకుండా ఎటెండయ్యారు ఆ పెళ్లికి. దగ్గరుండి జరిపించారు పెళ్లి తతంగమంతా...!

పెళ్లి ప్రసాదాలు పంచి పెట్టారు.

*ఆ రోజు కార్తీక పున్నమి రాత్రి తొమ్మిదయింది, మా భోజనాలు పూర్తయే సరికి ఆవాళ ఉత్సాహంగా మా యావిడ నంకాయపిండివంటలూ వేసింది ఆరుబయట వెన్నెల్లో పీటలువేసి కొసరి కొసరి వడ్డించింది*

# బావా బావా పన్నీరు

పాలడుగు వెంకటేశ్వరరావు

అందుకు కారణం మా సూరిబావ రాక అతను మాయావిడకి వేలువిడిచిన పెద్దమ్మ కొడుకు. మా సూరిబావమీదనాకు అపారమైన గౌరవం వుంది. నాకేకాదు అతనంటే మాచుట్టాలందరికీ గురి. కారణం అతను మాటకారి. పైగా వ్యవహర్త. ఇంటెలిజెంటు. హైద్రాబాదలో వుంటూ రెండు చేతులా ఆర్జించి పదేళ్ళు ఇళ్ళుకట్టాడు. అతనికి పెద్దవయస్సూ లేదు. ఒక ఏడాది అటు ఇటుగా ఇంచుమించు నావయసే వుంటుంది.

మా సూరిబావ త్వరగా భోజనం ముగించి బుగ్గన కిల్లీ బిగించి పడక్కుర్చీలో వాలి నామీద జోకులు వేయటం మొదలు పెట్టాడు. అతని జోకులకి తట్టుకొనగల సత్తా నాకు వుంది కాని ప్రక్కనే మాయావిడ ముసిముసినవ్వులు నవ్వుతూంది.

అందుకని చిరాకేసి రుచులారగిస్తూ భోజన కళని సేవిస్తున్న వాడినల్లా గబ గబ కళారాధనని ముగించి చెయ్యి కడుక్కొని లేచి చక్కా వచ్చాను.

'బావా ! ఏమిటోయ్ విశేషాలు?' అంటు మాటకదిపాడు సూరివెన్నెల్ని అనుభవిస్తూ.

''ఏముంటయి? పట్నంవాసివి లిటిగెంటువి నువ్వే చెప్పాలి'' అన్నాను.

'లిటిగెంటునా ? !' అని ఆశ్చర్య పోయాడు, సూరి.

'అవునోయి మనవాళ్ళందరిలోను పెద్ద తెలివిగల వాడివని పేరుగదా. అందుకని ఆమాట అన్నాను ఏం తప్పా ?' అన్నాను.

నామాటకి సూరిబావ పకపక నవ్వాడు. నవ్వుతూ వంట బ్రహ్మాండంగా వుందని మెచ్చుకున్నాడు. మెచ్చుకుని ముఖ్యంగా 'అన్నం భలేగా వుందోయి మెతుకులు తెల్లముత్యాల్లా వున్నాయి. ఇటువంటి బియ్యం నేను ఎక్కడా చూడలేదు. ఎక్కడ సంపాదించావు ?' అని అడిగాడు.

నేను గర్వంగా చూశాను. అదీ చూసి మాయావిడ పెదిమ విరిచి ముసి ముసిగా నవ్వింది. 'ఎక్కడ్నుంచి తెప్పించావు, బావా? మాక్కూడ ఒక అరబస్తా కావాలి తెప్పిస్తా వేంటి?' అన్నాడు సూరి మరల.

'తెప్పించటమా! అంతకర్మ నాకేమిటోయి? వాట్ని 'రాజనాలు' అంటారు మన చేలోనే పండాయి. కావలిస్తే తీసుకువెళ్ళు కాని ఎట్లా తీసుకెళ్తావు? మధ్యలో పట్టుకుంటే గొడవవదా ? ఈమధ్య అసలే గవర్నమెంటు మరీ స్ట్రిక్టుగా వుంటూందటమరి! ఒక మనిషిదగ్గర రెండు కిలోలకంటె ఎక్కువ వుంటె పట్టుకుని జైలులో పెడుతూందిట' అన్నాను.

సూరి నవ్వి, 'ఆవిషయం నాకు వదిలెయ్యి ఆమాత్రం తెలివితేటలయినా లేకపోతే ఎట్లా బ్రతుకుతామోయి ?' అన్నాడు, గొప్పగా.

నేను చిన్నపుచ్చుకున్నాను.

అది గమనించి 'హాలికులకి కోపం వచ్చి నట్లుంది' అన్నాడు సూరి !

'మాకు మిగతావి ఏవున్నా లేకపోయినా దానికి మాత్రం తక్కువ లేదు అన్నయ్యా' అందుకుంది ఆవిడ తగుదునమ్మా అని

'బావకేం తక్కువ చెల్లాయి రాజాపంటి జీవితం. అమృతహృదయుడు ఒకరి సంగతి పట్టడు. తానేమొ తన పూజాదికాలేమొ తన వ్యవసాయమేమొ కడుపే కైలాసం, ఇల్లే వైకుంఠం. ఈ కొండపల్లే సర్వ ప్రపంచమూ' అన్నాడు సూరి.

'నేను ఎన్నడూ ఈ కొండపల్లిదాటి బయటికి వెళ్ళననేగా? నీ ఇది' అని ఉడుక్కు న్నాను. సూరి పకపక నవ్వాడు.

నవ్వి, 'నీకేం తక్కువని బావా! రాజ యోగం ఏదీ చెయ్యి' అంటు నాచేయి అందు కున్నాడు. వెంటనే మాయావిడ దీపంబుడ్డి తెచ్చింది. 'చచ్చాంరా దేముడా ఏంచెప్తాడో గదా. ఐనా చెయ్యి వప్పచెప్పి ఇప్పుడేమనుకుని ఏం వుపయోగం' అని విచారిస్తూ కూర్చున్నాను.

లొడలొడా వాగుతూ పోయేడు సూరి.

నేను అమాయకుడ్నని, ఏం తెలియదని; చాదస్తుడ్నని, కోపం ఎక్కువని ఏమిటేమిటో చెప్పుకుపోతున్నాడు. నా కిష్టంలేదు. కాని ఏంచేసేది ?

చెయ్యినాది. చెప్పేది సూరి బావ. వినేది మా ఇంటావిడ. 'ఒద్దు మొర్రో' అంటు ఎంత మొత్తుకున్నా వాళ్ళు వినేటట్టు లేరు.

చెప్పి చెప్పి అలిసిపోయేడు సూరి. లొప్పేతు న్నాడు. ఇంకా చెప్పనున్నట్టు చూస్తూ వుంది మాయావిడ. 'నీకు అట్లాగే కావాలి లే రాస్కెల్' అనుకుని చెయ్యి అప్పజెప్పి కూర్చు న్నాను నేను.

అంతలో పిడుగు వదిలెడుసూరి.

మాయావిడ మొహం తెల్లపోయింది.

'శ్రీ కృష్ణ జన్మస్థాన ప్రాప్తి తప్పేట్టు లేదుగదా' అని నిట్టూర్చేడు సూరి, పెద్ద ఇదిగా.

'నిజంగానా అన్నయ్యా ! సరిగా చూడు ఇంకొకసారి' అంది తను, కంగారుపడి.

'అక్కడికీ ఒకటి రెండుసార్లు చూశాను అమ్మాయి. ఇదేనెల? అక్టోబరు గదూ ఇంకా నెల రోజులలోపునే తప్పకుండా గీవి పెట్టిఎడి వుంది. బావ కనీసం పదిగంటలపాటయినా నిర్బంధంలో గడపాల్సి వుంటుంది. తప్పదు మరి' అన్నాడు సూరి, గంభీరంగా...

ఆవిడ బిక్కమొహం వేసి ముక్కు చీదు కుంది.

'మరేంభయం లేదు. దిగులుపడకమ్మాయి మేమంతాలేమూ. తప్పించటానికి. అయినా పదిగంటలేగా. నీ కెందుకు నిశ్చింతగావుండు' అంటు భరోసా ఇచ్చేడుసూరి.

'నీ మొహంలే. నువ్వు ఒకపని చేస్తావా ? మాటలపోగువి. చల్లటివేళ ఆడ కూతురిచేత బిక్క మొకం పెట్టించావు తెగవాగుడు. దాన్నే తెలివి తేటలని అనుకుని ఎగిరి పడ్తారు ఈ పిచ్చి మాలోకాలు' అనుకుని—

'ఊ. ఏం బావా ఇంకా ఏంటి ? చెప్పు' అన్నాను, గంభీరంగా.

వెంటనే నాచెయ్యి వదిలేసి సజ్జకు మార్చాడు సూరి. 'ఊ. ఏం అమ్మాయి. మనూరు వెళ్లవా? అట్లాతద్దికని కాంతయ్య గారి కనకం, సూరయ్యగారి సీత,

పేరిశర్మగారి పద్మ అందరూ వస్తున్నారని నుసూర్నుంచి మొన్న మా అబ్బులు రాసింది. వెళ్ళి నాల్గు రోజులు సర్దాగా అందర్తోగడిపి రారాదూ? ఈ జంజాటాలు ఎప్పుడూ వుండేవేగా?' అన్నాను, పెద్దఇదిగా.

మా ఆవిడ మొహం అంతలోనే విప్పారింది!

ఈ ఆడాళ్ళంతే. పుట్టింటి సంగతి వస్తే సర్వం మర్చిపోతారు.

'కొంప ముంచావుగదరా దేముడా తనని సంతోష పెట్టటాన్కి కొత్తఎత్తు ఎత్తావ? మరి నాకేందారి? అనుకుని "అదెల్లా బావా! తను మాత్రం ఇదంతా వదిలి ఎల్లా వెడుతుంది? పైగా నాకు ఇబ్బంది గదా"అని, అడ్డం పడబోయాను.

సూరి పకపకనవ్వి 'నీఇబ్బందుల్దేముందిలె బావా. నాల్గు రోజులు అమ్మాయిని సర్దాగా వెళ్లిరానీ. అంతగా అయితే నువ్వు నాతో వద్దువుగాని. హైద్రాబాదు చూసి నాల్గు రోజులు సర్దాగా గడిపి వద్దువుగాని'అన్నాడు.

అదీ బాగానే వుందనిపించింది.

అటుతనని పుట్టింటికి పంపినట్లూ వుంటుంది.

ఇటు నేను పట్నం చూసి వచ్చినట్లూ వుంటుంది.

ఉభయ తారకంగా వుందని, వుంటుందని సరేనన్నాను. అది పట్టుకున్నాడు సూరి బావ. పట్నంలో టిప్‌టాప్‌గా వుండాలి. ఈ గావంచా పంచలు, సీరుకావి అంగవస్త్రాలు చూసి నవ్వుతారు ఆపటాని రూపాయిలు కర్చు పెట్టించి గెల్లావారి కొట్లో బట్టలు తీయించి నాల్గు పాంట్లు నాల్గు షర్టులు కుట్టించాడు. నా పిలకని కత్తిరింపటానికి శతధా ప్రయత్నించాడు. కాని ప్రాణంపోయినా అందుకంగీకరించేది లేదని మొండికేశాను నేను.

పాంట్లు—వాడ్ని తగలెయ్య— లూజుగా కుట్టాడు పీర్సాయిబు. అందుకోసమని బెల్టు కొనిపించి నడుంకి బిగింపించాడు సూరి బావ. మొదట్లో పాంట్ కొత్తగా అనిపించింది. తరవాత ప్రాక్టీసువల్ల కొత్త కొద్దిగాపోయినా కొత్తకొత్తగానె వుందినాకు. నా అవస్తకి ఆవిడ ఒకటే నవ్వు. సూరిబావ ముసిముసి నవ్వులు చెప్పనక్కరలేదు. అతను బడాయి వూస్తరు!

'నవ్వండి నవ్వండి నవ్విన నాపచేనే పండుతుంది' అంటే'అవునుబావా. నిజం ఎవరెల్లా నవ్వితే మనకేం? నవ్విపోదురు గాక మన కేమి సిగ్గు' అని ఒకటే నవ్వు సూరిబావ.

అట్లతద్ది దగ్గరపడగానె —

ఒక శుభముహూర్తాన అన్నీ సర్దుకొని, ఎన్నో జాగర్తలు చెప్పి పుట్టింటికి వెళ్లింది ఇంటావిడ. ఆవిడ్ని సాగనంపి దిగులుపడుతున్న నన్నుచూసి 'ఏంటె బావా! చిన్న పిల్లాడిలాగ. మనం కూడ హైద్రాబాదు వెళ్తున్నాం గదా. చీరప్.'అంటు నా బుజం చరిచాడుసూరిబావ.

అతని సెలవు కూడ అయిపోవటం వలన ఆ రెండోరోజే మేమూ బయల్దేరాము.

రాజనాల మీద సూరిబావ మోజు పోలేదు. సర్లెమ్మని సింమెంటు బస్తాలో మూట కట్టాము. దానికి ఒక పాతగుడ్డ తొడుగు తొడిగాము. దొంగవనికి సిద్ధపడ్డాము.



'బావా! నువ్వేం భయపడబోకు. కూడా నేనున్నాగా. అంతా నేను చూసుకుంటాను. ఈ రాజనాలు చూసి మీ చెల్లెలు, పిల్లలు ఎంతో సంతోషిస్తారు. నీ మేలు జన్మలో మర్చిపోలేరు. మనకేంటి బావా. బోల్డు ఇన్ఫ్లుయెన్సు. మనని ఎవడు పట్టుకుంటాడు ?' అంటూ భరోసా ఇచ్చేడు సూరి. రైలెక్కేము.

కాని నా మనసు మనసులో లేదు.

గుండెలు దడదడ మంటున్నాయి.

పాంటు మాటి మాటికి, కిందికి జారి పోతూవుంది.

కాలమాన పరిస్థితుల్ని పట్టి బియ్యం తీసుకుపోవటం నేరం. పట్టుకుంటే జుల్మానాతో పాటు జైలుశిక్ష కూడా పడవచ్చును—అదీ నా భయం!

అందరూ మమ్మల్ని మా రాజనాల మూటనే చూస్తున్నట్టు అనిపించి గుండెలు పీచు పీచు మంటున్నాయి—నాకు. అలవాటు లేని పనాయె.

సూరిబావ గల గల వాగుతు ఉన్నాడు అతని ధోరణి అంతే!

అంతలో చీకటి పడింది.

అమ్మయ్య.

ఇంక ఫర్వాలేదు.

చీకట్లో మా మూట ఎవరికంటా పడదు గదా అని మనసు కుదుటపర్చుకున్నాను. సూరిబావ సమయం చూసుకుని చెప్పేడు. 'ఓయి బావా! నీకేం భయంలేదు. నేనున్నాను. ఎవరన్నా అడిగితే చెప్పు. ఆ బియ్యం మూట నీదేనని. వాస్తవానికి అది నీదేగా!'

'భలేవాడివి బావా! అది నీది గదా నేనిచ్చాను అనుకో. కాని నువ్వుగదా దాన్ని తీసుకు వెళ్తూంట' అన్నాను, తెల్ల మొహం వేసి.

సూరి పక పక నవ్వాడు.

'ఓయి పిచ్చి బావా. నిజమే అనుకో. కాని కాస్త ఆలోచించు. ఒకవేళ కర్మగాలి దాన్ని ఎవడో పట్టుకున్నాడనుకో. అది నాదే అంటా ననుకో సరే. నన్ను పట్టుకుంటారు అనుకో. అప్పుడు ఏందారి? నువ్వు ఏంచెయ్యగలవు? నీకేంతెల్సు? ఎవరి పరిచయం వుంది? ఏం మాట్లాడగలవు? నన్ను ఎట్లా విడిపించ గలవు? అదే—నిన్ను పట్టుకుంటే — అక్కడ నాకు అందరూ తెల్సు. నా ఇన్ఫ్లుయెన్సు వుపయోగించి నలుగుర్ని తీసుకొచ్చి ఏం కాకుండా చూడగల సత్తా నాకు వుంది. అదీ వుపాయం. ఏమంటావు?' అన్నాడు.

"ఓరి నీ తెలివి తెల్లార. నీ కడుపునిండా తెలివితేటలేగదా అన్యాయంగా నన్ను ఇరికింమతావా. దేముడా? ఏందారి?" అనుకొని 'సర్లె బావా!' అన్నాను తప్పక.

'అదీ బుద్ధిమంతుడి లక్షణ మంటే. నీకేం భయంలేదు. నే నున్నాను. నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం. మరేం దిగులుపడకు.' అని భరోసా ఇచ్చేడు సూరిబావ.

టకటక మంటు రైలు నడిచింది. ఎవరు పట్టుకుంటారో—ఏంగొడవ వచ్చి పడ్తుందో అని—దడ దడ మంటు గుండెల్లో భయం నిండుకుంది.

'ఈ గండం గడిచి గట్టెక్కితే చాలు దేముడా' అనుకొని ప్రాణాలు బిగపట్టుకొని కూర్చున్నాను. సూరి బావకి ఏం పట్టినట్టు లేదు.

'ఓ రాజనాల బియ్యం మూటా! కొంప ముంచకే. ఇటువంటి గొడవలు ఎప్పుడూ ఎరుగను గదే' అని ఎన్నో ప్రార్థనలు చేసేను. బిక్కమొహం పెట్టేను.

అదిచూసి 'బావా నీకేం భయంలేదు ధైర్యంగా వుండు. ధైర్యే సాహసే లక్ష్మి' అంటూ నా బుజం చరిచేడు. సూరిబా బుజం చరిచినప్పుడల్లా గుండెల్లోని దిగుల క్షణ క్షణానికీ అధికమవుతూ వచ్చింది కా దాన్నుంపదెగ తగ్గనేలేదు.

రోజులు అటువంటివి మరి.

బియ్యానికి కట కట.

దొంగ వ్యాపారం ముమ్మరంగా సాగుతున్న దినాలు.

పట్టుబడిన వాళ్ళు జైళ్ళలో కూర్చొన్న దృష్టాంతాలు నాకు తెల్సు.

మావూరి పుల్లయ్య అటువంటి పనిచేసి అరొందలు జుల్మానా కట్టి ఆర్నెల్లు జైల్లో





కూర్చుని వచ్చాడు. రైసుమిల్లు రాజయ్య రెండునెలలు కూర్చున్నాడు. ఐతే ఏం ? వాళ్ళకేం సిగ్గా? కాని అటువంటి పరిస్థితే వస్తే నేను ఆపని చెయ్యగలనా ?

ఏనాడూ ఇంట్లో తప్ప బయట ఇన్ని నీళ్ళయినా తాగి ఎరుగనే నిత్యాగ్ని హోత్రినే పైగా నా స్నానం సంధ్యపూజ ఎట్లా కుదిరి చచ్చేట్టు ?— జైల్లోపడితే— ఇదీ నాగొడవ ! అవసరమయితే మలమల మాడి ఛస్తానుగాని జైలుకూడు ఎట్లాముట్టను ?

అయినా ఇదేం కర్మ.

అసలు నేరం చెయ్యాల్సిన అవసరం నాకు లేదే ?

పైగా పరువుమాటేమిటి ?

అటువంటిదే జరిగితే ఎట్లా తలెత్తుకు తిరిగేట్టు తిరిగి ?

'ఎటువంటి కర్మ రాసావురా దేవుడా' సూరిబావ మాఇంటికి రానేల? వచ్చాడు పో. రాజనాలు కావాలని దేవిరించనేల. అడిగితే ఇచ్చాను పో తగుదునమ్మా అంటూ నేనూ అతనితో బయలుదేరనేల ? ఏం కర్మ ? ఇది తప్పి గండం గడిచి బయటపడ్తే కొండకు వస్తానని తిరుపతి వెంకటేశ్వరుడికి మొక్కు కున్నాను.

'బావా మరేం భయపడకు. ఈ బండి అక్కడికి తెల్లవారుఝామున చేరుతుంది. చీకట్లో మన బియ్యంమూటని చూసేవాళ్ళు వుండరు. చీకట్లో చల్లగా బయటపడదాము' అని నాకు ధైర్యం చెప్పాడు సూరిబావ, పెద్ద ఇదిగా.

అట్లా అయినా బాగుండును అనుకున్నాను.

కాని దాని కర్మగాలి కాజీపేటలో క్రాసింగని రెండు గంటలు ఆగింది, రైలుబండి. నాంపల్లి చేరేసర్కి తెల్లగా తెల్లవారింది.

స్టేషన్నిండా జనం.—అక్కడక్కడా పోలీసులు.

వాళ్లు అందరూ మా 'రాజనాల బియ్యం మూట'ని పట్టుకుంటానికి వచ్చినట్టువుంది. అందరు తీక్షణంగా, నిశితంగా చూస్తా వున్నారు, మా వంకే !

'లే బావా! లే. వచ్చేశాం' అన్నాడు సూరి.

లేచాను.

'నేను చెప్పిన మాటలు జ్ఞాపకము న్నాయిగా.'

తలూపాను.

'నీ కేం భయంలేదు. ధైర్యంగా వుండు: లేని భయం పుట్టుకొచ్చి నరాలు వణికాయి.

'ఎవడన్నా అడిగితే ధైర్యంగాచెప్పు. నీదేనని ఆర్వాత నేను చూసుకుంటాను ఏమయినా ఖర్చు అయితే అన్నీ నేనే భరించుకుంటాను ఏం ?'

తలూపాను.

'కూలీ. కూలీ' అంటూ వుషారుగాపిలిచాడు సూరి. వాడి మొహం చూస్తే చాదస్తుడులా వుంది—ఒక కూలీ వచ్చాడు. బేరందగ్గ రతర్జన భర్జనలయేయి. వాడు రూపాయడిగేడు. సూరి అర్ధరూపాయ ఇస్తానన్నాడు. 'ఏముందం దులో బట్టలేగా' అని వాడ్ని దబాయించాడు సూరి. వాడు మూటని పట్టుకునిలేపి దించి. 'బరువుగా వుందండి. గిట్టదు. రూపాయి వ్వండి'అని అన్నాడు. అని, 'బియ్యమా ?' అని అడిగేడు. చిటపట్లాడి వాడ్నికసిరికొట్టి, తింౖడించి—'అర్ధరూపాయిస్తాను. ఇష్టమయి తేరా.' అన్నాడు సూరి. లేకపోతే పో' అని విదిలించాడు ఇదిగా. 'ఇష్టం కాదండి' అంటు అదొకలా చూస్తూ పోయేడు వాడు.

'ఓయి బావా ! ఎంతోకొంత పదరాదా' అన్నాను. నా గుండెల్లో రైళ్లు పరుగెట్టే గిజగిజ మొదలయింది.

'అది కాదులే. మనం వెంటనేసరే సంటే వాడికి అనుమానం వస్తుంది అందుకని మనం బెట్టుచెయ్యాలి అన్నాడు సూరి పోజు ఫెట్టి. "కూలీ. కూలీ."అంటు పిలిచాడు మరలా.

మొత్తానికి ఆ రూపాయికే మరొకడ్ని మాట్లాడేడు చివరికి సూరి.

తనకీ అనుమానం వచ్చినట్లుంది ! పట్టు కుంటారేమొ అని.

మూటని అతనికి ఎత్తి గబ గబ బయట పడ బోయాము, దొంగల్లాగ.

అనుకున్నంతా అయింది! మిడిగుడ్లతో క్రూరంగాచూస్తూ, బుంగ మీసాలు గల ఒక పోలీసు వచ్చి అడ్డంగా నిలిచాడు. అతని వెనకాల మొదట వచ్చిన కూలీ నిలబడి వున్నాడు. 'కొంప మునిగింది. అనుకున్నంతా అయింది' అని దడదడ్లాడాను.

'ఏంటి ఈ మూటలో?'అన్నాడు పోలీసు.

"ఏమున్నాయి? బట్టలు" సూరి దబా యించబోయేడు.

'కాదు. అందులో బియ్య మున్నాయని, అనుమానంగా వుంది. నడవండి'

'బియ్య మున్నయ్యా నాకేం తెలుసు ?

> ### గ్రాడ్యుయేట్ల దేశం
>
> భారత దేశంలో తల సరి ఆదాయం ఏడాదికి 75 డాలర్లు మాత్రం అని ఒక అమెరికన్ సర్వే అంచనా.అయితేనేం భారత్ చాలా గొప్పదేశం కూడానట. ఎందుకంటే అమెరికా, రష్యాలను మినహాయిస్తే యీ దేశంలో వున్నంత మంది సైన్సు గ్రాడ్యుయేట్లు మరెక్కడా లేరుట ! వీళ్ల వుద్యోగాల సంగతి ఆ సర్వే ఎత్తలేదు!

బట్టలేమొ అనుకున్నాను' అన్నాడు సూరే.

'సర్లే నడవండి'

'నాకేంపని ?'

'అదేమిటి ? ఆ బియ్యం మూట మీది కాదూ ?'

'కాదు'

'మరెవర్ది ?'

నా చెయ్యి గిల్లాడు సూరి.

'మరేం భయంలేదు. చెప్పెయ్యి. నేను చూసుకుంటాను' అని గుస గుసలు పోయేడు.

'నాదండి' అన్నాను పొంటు పైకి లాక్కుంటు.

'మీదా?!మరి ఇప్పటివరకూ అయనెందుకు మాట్లాడేడు ? సర్లే రండి ?' అని రైల్వేస్టేషను ప్రక్కన వున్న ఒక ఆఫీసుకు తీసుకెళ్లేడు నన్నూ, మూటనీ.

'ధైర్యంగా వుండు బావా నేను వెళ్లి రాజభూషణంగార్ని తీసుకొస్తాను. త్వరలోనే వస్తాను' అన్నాడు సూరి నా వెనకే వస్తూ.

'రాజభూషణ మెవరు ?' అన్నాను శకునితో జూదానికి కూర్చోబోతున్న ధర్మరాజులా.

'ఆయన సివిల్ సప్లయిస్లో ఆఫీసర్లే. ఆయనొచ్చి చెప్పగానె రెండు నిమిషాల్లో ఇంటికి వెళ్లిపోదాము. మరి నేను రానా?' అన్నాడు సూరి.

తలూపాను. సూరి తల ఎగరేస్తు వెళ్లి పోయాడు.

అప్పటికి ఉదయం ఎనిమిదయింది.

పోలీసుతోపాటు నేను అక్కడ్నె కూర్చు న్నాను, లోపల యిద్దరు పని చేసుకుంటు న్నారు. (ఇంకా వుంది)

### నూతి నీళ్లు — తగాదా

అహ్మదాబాదుకు చెందిన రనేవాల్ పూర్ అనే గ్రామంలో వో హరిజన యువతి హిందువుల నూతిలోంచి నీళ్లు తోడుకుందట. దాంతో హిందువులందరికి కోపం వచ్చి చేతికందిన దాన్ని ఆయుధంగా చేసుకుని హరిజన కాలనీ మీద విరుచుకుపడ్డారట. తత్ఫలితంగా లెక్కలేనంత మందికి గాయాలు తగలడం, వో యిద్దరికి ప్రాణాలు పోవడం జరిగిందట. ఈ సంఘటన తరువాత రాష్ట్ర ముఖ్యమంత్రి గారు ఆ వూళ్లో పోలీసును, రిజర్వు పోలీసును కాపలా పెట్టి హరిజనులకు హామీ యిచ్చారట— ఏమని !!

### ప్రాణంతీసిన ఆపరేషను

లక్నో కె. జి. మెడికల్ కాలేజికి చెందిన ఆర్థోపీడిక్ శాఖ ఆపరేషను థియేటరులో వో నాలుగేళ్ళ కుర్రాడికి ఆపరేషను జరిపాక అతను టిటానస్ జబ్బుతో (ధనుర్వాతం వంటిదా!) చనిపోయాడట. ఈ కారణంగా పోలీసు ఆ థియేటరును సీలువేశారట కిమర్థం!!

### వింత హర్తాళ్

మాడి చావడం కన్నా చేతికందిన కల్తీ సరుకయినా వుపయోగించుకోడానికే ప్రజలు యిష్టపడతారు గనుక ఆహార పదార్థాల కల్తీని ఆపడం అనుకున్నంత తేలికయిన పని కాదని విశాఖ పట్టణంలో ఆ పని ఆపుదామనుకున్నవారు తీర్మానించారట. ఆహార పదార్థాల శాంపిల్స్ తీసుకున్నారట. దాంతో వ్యాపారులందరికి కోపం వచ్చి హర్తాల్ ప్రకటించి, అంతతో ఆగక గాజువాక వారి వీధిలో పాలసరఫరా సంఘం వారి పాలన్నిట్నీ పారబోసేశారట, హోటల్స్ ఇన్స్పెక్టర్ని చావ దన్నారట.

### కరెంటుతోపాటే కొన్ని ప్రాణాలూ...

వున్నట్టుండి కరెంటు పోవడం వల్ల తాను చేయబోయిన ఆపరేషనుకు అంతరాయం కలిగి, తన కళ్ల ఎదుటే నాలుగేళ్ల డిఫ్తీరియా పేషంటు చనిపోయిందని అలహాబాదు స్వరూపరాణి నెహ్రూ ఆసుపత్రికి చెందిన వో డాక్టరుగారన్నారట. తాను ఆపరేషను బ్యాటరీ లైట్ల సహాయంతో చేసినా,




పరికరాలకు కరెంటు కావాలని , కనుక ఆపరేషను చేయలేక పోయినట్లు ఆయన అన్నారట. అస్తమానూ పోయే కరెంటు తనతో యీ విధంగా కొన్ని ప్రాణాలు కూడా తీసుకు పోతోందని కూడా ఆయన అన్నారట.

### చారిత్రాత్మక చికిత్స

శాన్‌ఫ్రాన్సిస్కోలో రెండు నెలల క్రితం హిదర్ అనే వో అయిదేళ్ళమ్మాయి వో రోగంతో వో ఆసుపత్రిలో ప్రవేశించిందట. వ్యాధి నిరోధ శక్తిని కలిగించే హార్మోనులను ఆమె శరీరం తయారు చేయలేక పోడమే ఆ వ్యాధట. ఈ శక్తిని కలిగించే థైరుస్‌గ్లాండ్ థయిమోసిన్ అనే హార్మోనును తయారు చేయలేక పోయిందట. పాలిచ్చే జాతి శవాల థయిమెస్‌గ్లాండులలోంచి థయిమోసిన్ తయారు చేసి, దాన్ని ఆమెలోకి ఎక్కించారట అక్కడి డాక్టర్లు. ఈ చికిత్స ఫలితంగా మృత్యు ముఖంలో నుంచి ఆమె బయట పడిందట. ఈ రకం చికిత్స ప్రపంచంలో యిదే మొదటి సారట. హెరాల్డ్ టు ది మెడికల్ వరల్డ్.

### లక్షరూపాయలు మటుమాయం

ఉత్తర బొంబాయికి చెందిన ఇండియన్ ఓవర్సీస్ బ్యాంకు క్యాషియరు 27 వ తేదీ వుదయం సేఫ్ లోకి వచ్చి, సేఫ్‌లోంచి వో లక్ష రూపాయలు తీసి బల్ల మీద పెట్టి, వో క్షణం ఎటో వెళ్లి వచ్చేసరికి ఆ లక్ష రూపాయలు మటుమాయమయ్యాయని ఆయన పోలీసులకో రిపోర్టు యిచ్చాడట.

### సంపాదక సంహారం

ఆగ్రాకు చెందిన సెక్యులర్ టైమ్స్ పత్రిక సంపాదకుడు మిస్టర్. శివ్‌నారాయణశర్మ మున్నీ అనే 40 ఏళ్లాయన మొన్న 27 వ తేదీన కాశ్మీరి బజారులో జరిగిన వో కాల్పులలో క్షతగాత్రులైన వారిని చూడ్డానికి సరోజినీ నాయుడు మెడికల్ కాలేజీ హాస్పిటలుకు వెళ్తే అయన్ని ఎవరో కాల్చి చంపేశారట. ఈయన తన పత్రికలో నల్ల వ్యాపారులను, అవినీతులనూ దుయ్యబట్టి రాసేవారట.

2-8-1974 శుక్రవారం మొదలు
8-8-1974 గురువారం వరకు

## వారఫలం

మహేష్

**మేషం** :— వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృషభం** :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది.విలాస వస్తువులు కొంటారు.

**మిథునం** :— శ్రమపడినా ఫలితం దక్కదు. వృత్తిలో ఎవరినీ విశేషంగా నమ్మడం తగదు వారం మధ్యలో అనుకూల వార్తలను వింటారు ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మీ కంటే పెద్దవారు కూడా మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం** :— ఇతరులతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమకు గురి కాగలరు. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**సింహం** :— అనవసరమైన సందేహాలు కలుగుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ పెరుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో మీ ప్రయత్నాలుకు ఆటంకాలు రాగలవు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**కన్య** :— మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఎవరితోను వాదప్రతివాదాలు తగవు. వారం ఆఖరులో భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అలంకార వస్తువులు కొంటారు.

**తుల** :— స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. పోటీవారిలో గౌరవం లభిస్తుంది. వ్యాపారంలో నూతనావకాశాలు లభిస్తాయి. సాహసిక వ్యవహారాలు

### దొంగనోట్ల క్యాషియర్

అలహాబాదులోని వో ప్రభుత్వ బ్యాంకులో దొంగ వందరూపాయల నోట్లను ప్రజలలోకి వంప జూస్తున్న ఆ బ్యాంకు క్యాషియర్ని పోలీసు పట్టి వేసిందట. నోట్లు కావాల్సినన్ని దేశంలో తిరగడం లేదని, ప్రభుత్వానికి విషయాలలో యధా శక్తి సహాయం చెయ్యాలని దొంగనోట్ల వ్యుత్పత్తి వారి వూహ ఏవి!

### కోర్టుకువెళ్ళిన ఏనుగు నామం

కాంచీపురంలోని దేవరాజస్వామి కోవెలకు చెందిన వో ఏనుగును ఏటా వుత్సవాలకు "వై" ఆకారంలో నామం పెట్టే ఆనవాయితీ వుందట. అదే ప్రకారం యీ ఏటి పండుగలకూ తెంగలై శాఖ వారి ఆచారం ప్రకారం "వై"నామం కోవెల ఏనుగుకు పెట్టారట. కానీ వడకలై శాఖ వారు తమ ఆచారం ప్రకారం "యు" ఆకారంలో మరో ఏనుగుకు నామం పెట్టారట. దాంతో రెండు శాఖలవారు కొట్లాట్ల వరకు వెళ్లారట. అంతతో ఆగక వారు కోర్టుకు వెళ్ళే ఆనవాయితీ ప్రకారం వై నామమే పెట్టాలని తీర్పు యిచ్చిందటా కోర్టు. ఆనక మద్రాసు హైకోర్టుకు వెళ్లారట. ఆ కోర్టు కూడా అదే మాటన్నదట. అనరింతకీ ఏనుగు శైవమా, వైష్ణవమా!!

### జలాంతర్గాములూ, జాగ్రత్త!

మండపం సెంట్రల్ మెరైన్ ఫిషరీస్ రిసర్చ్ సంస్థ వారు సముద్రపు అడుగున వున్న డ్యూగాంగ్ అనే వో రకం జలచరాల శబ్దాలను టేప్‌రికార్డు చేశారట. ఆ జలచరాల శబ్దాలు కోడి పిల్లలశబ్దాలకు దగ్గరగా వున్నాయని, డాక్టర్ వెంకట్రామన్ చెప్పారట. ఈ టేపులను అన్నామలై విశ్వవిద్యాలయానికి యిచ్చి శబ్దాలలో ఏదైనా భాష యిమిడ వుందేమో పరిశీలించమని చెప్పినట్టాయనన్నారట. ఈ డ్యూగాంగ్ శబ్దాలను పరిశీలించి, శత్రు సైన్య జలాంతర్గాముల రాకను మనకివి తెలియ పరచేలా చేసుకోవచ్చుననీ, అంతేగాక తమ శబ్దాలతో జలాంతర్గాములను భయపెట్టేట్టు కూడాచేయ వచ్చునీ యీయన అభిప్రాయపడ్డారట.

### నారీసాహసం

కొచ్చిన్‌నుంచి అలెప్పి బయలుదేరిన వో కారును అలెప్పికి వో ఆరు కిలో మీటర్ల దూరంలో వో యువతి ఆపి, తనను ఎక్కించుకోమని అడిగితే




వారు సహాయంగా ఆమెను కారులో ఎక్కించుకుని పోన్లే అని ఆమె యింటికి కూడా తీసుకు వెళ్లి దింపారట. కారు దిగిన ఆమె వారిని యింట్లోకి ఆహ్వానిస్తే, ఆమెతో లోపలకు వెళ్లిన వారిని తుపాకులతో మరికొందరు ఆహ్వానించి, వారి వద్దనున్న డబ్బు దస్కం అంతా వూడ్చుకు ఆమెతో సహా పారిపోయారట.

### రచయితలకు చిట్కాలు

★ సినిమాలు ఎక్కువగా చూడడం మొదటి సాధన... ప్రత్యేకించి 'రేప్' సీనులున్న సినిమాలు జాగ్రత్తగా గమనించి చూడాలి.

★ అబ్బాయిలైనా ఫర్వాలేదు. మంచిఅమ్మాయి పేరు వెతికి పెట్టుకోవచ్చును... స్త్రీలు చేస్తున్న రచనలను అప్పుడప్పుడూ చదవాలి.

★ కథ ఎప్పుడూ 'ఫ్లాష్‌బ్యాక్'లోనే ఉండాలి పాత్రల స్వభావం సినిమా నటులు తెరమీద చూపించే నైజానికి దగ్గరగా ఉండటం మంచిది.

★ ప్రేమ సన్నివేశాలు రాస్తున్నప్పుడు అది ప్రేమ సీనా ? రేప్ సీనా ? అన్నది చదువరికి పూర్తిఅయ్యేదాకా తెలియ కూడదు.

★ ప్రేమ త్యాగం వీటిమీద ఉపన్యాసాలుండాలి. కులాంతర వివాహం ఒకటి, విధవా వివాహం ఒకటి ఉండాలి. ఈ యిద్దరిలో ఒకర్నైనా చివర చంపాలి.

★ త్రాగుడు సీనులు కూడా ఒకటి రెండుండాలి. కాని అది చాలా "కాస్ట్లీ" అయితే మంచిది.

★ ఏడెనిమిది పేజీల కోసారి బీర్‌బాటిల్సు (బ్రాందీ బాటిల్స్, అయిసు క్యూబులు, ఫ్రైడ్‌క్యాష్యూలు అంటూ వివరంగా 'వెట్' పార్టీ సీనులల్లాలి.

ఎస్. చిట్కాలరావు (కిటుకులనగర్)

బాగుంటాయి. వారం ఆఖరులో మీరు అనుకునేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. స్త్రీలకు— ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. దైవ కార్యాలు నెరవేరతాయి.

వృశ్చికం:— అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. అనుకూల వార్తలను వింటారు. ఆర్థిక వ్యవహారాల్లో మొగ్గమూటాలు తగవు. ప్రయాణాలు వాయిదా పడతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి. స్త్రీలకు—సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

ధనుస్సు — మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు ఏర్పడతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి. కోర్టు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

మకరం :— వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రావలసినడబ్బు అందుతుంది. ప్రయోజనం' గల సంభాషణలను జరుపగలరు. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేయగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

కుంభం :— చేజిక్కిన అవకాశాలు కూడా జారి పోవచ్చును. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించగలదు స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

మీనం :— వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. ఉద్యోగంలో చికాకులు ఏర్పడతాయి. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్త్రీలకు—ఆరోగ్యంబాగుంటుంది. మీ తలుక్కు వస్తువులు పోవచ్చును.

### 'అంతా కుంతీ పుత్రులే'

ఒక అమెరికన్ రాష్ట్రంలో యీ ఏడాది ప్రారంభంలో 1974 లో మొదట పుట్టిన పాపాయి కు అవార్డులు యిస్తామని ప్రకటించాయట నాలుగు స్థానిక పత్రికలు. నలుగురు పాపలు దొరి కారు. కాని ఆ నలుగుర్ని కన్న తల్లులకీ కూడా పెళ్ళిళ్ళు కాలేదుట. పైగా వారి వయస్సులు కూడా 'పెళ్ళీడు' కాదు ముగ్గురి వయస్సులు 15, 17 19 మాత్రమే నాలుగో అమ్మాయి తన బిడ్డకి అవార్డ్ ... తండ్రి లక్ష్మి యిద్దరి పేర్లు తెలిసిన ఏకైకమ్మాయి తిరస్కరించిందట.

# గళ్ళచీర

లతిక




“స్త్రీ” యెల్లమ్మతోట, జగదంబ, విజయ టాకీస్, మాయాబజార్” దిగవలసిన స్టేజి పేర్లు చెపుతూ, భారంగా 13వ నెంబరు సిటీ బస్సు ఆగింది.

చాలా మంది దిగేరు. వరద రాజులుకూడా దిగేడు. జేబు తడుముకున్నాడు. డబ్బులున్నాయి. “రూపాయిలో పది! అర్ధరూపాయిలో పావలా! అక్కడో టెక్కట్టు రావాల! అఁరావాల! కేజి హెచ్! కలక్టాఫీసు, కాలేజి, బస్టాండ్, పోస్టాఫీస్! హుషారుగా రైట్ చెప్పాల! రైట్!” బస్సు కదిలింది.

వరదరాజులు బుర్రలో ఆలోచనలు కదుల్తున్నాయి. జేబులో చిల్లర కాక ఇరవై రూపాయిలున్నాయి. రత్నాలకి చీర, జాకెట్టు గుడ్డ కొనాలి వచ్చే శుక్రవారం దాని పుట్టినరోజు. రత్నాలు వరదరాజులికి సవితక్క కూతురు. మనసుపడిన గుంట. అడిగిన బంగారం యెట్టాగలిగితే మనువు ఖాయం. దానికితనంటే ఎల్లమారిన 'యిది'.

ఇరవై రూపాయిలకి అట్టే మంచి గుడ్డలు రావు. ఇంకా మంచివి కొనడానికి డబ్బుల్లేవు. వరదరాజులు జేబులు కొట్టేకళలో ప్రవీణుడు. రత్నాలికి అలాటివన్నీ నచ్చవు కాని... తనకి నచ్చిన బట్టలు పెట్టాలంటే, దానికి నచ్చని పని చెయ్యకతప్పదు. చెయ్యాలా వద్దా? వరదరాజులు ఆలోచనలో పడ్డాడు.

జేబులుకొట్టే వాళ్ళని, కన్నాలు వేసే వాళ్ళని దొంగలంటుంది సమాజం. దొంగతనాలు, దోపిడీలు నీతి న్యాయం కాదంటుంది సమాజం. మరి, ప్రపంచమంతా అవినీతి అన్యాయం లేకుండానే నడుస్తోందా? దొరల వేషాల్లో మేడలలో కులికి, కార్లలో తిరిగి దొరతనం చెలాయించే గొప్పవాళ్ళంతా దొరలేనా? ఆళ్ళసంపద కష్టార్జితమేనా? చేసిన తప్పుడు పనులకి పరిహారంగా దేవుళ్ళకి చెల్లించే ముడుపుసొమ్ము ఏ అవినీతికీ అన్యాయానికీ ఒడిగట్టకుండానే వచ్చిందా?

ఇయన్నీ అనవసరం. ఎవ్వరి లోకంవాళ్ళది. ఓకాడికి చేయి చాచేముందు తనపని చూడాలి. మనువాడబోయే పిల్లకి పుట్టినరోజు బట్టలు పెట్టాల్సిందేగా వుండాలి. అవసరం గడవడమే ముఖ్యం. ఎలా గడిచిందన్నది అనవసరం. వరదరాజులు ఓ నిర్ణయానికొచ్చాడు.

కదిలేడు. నడుస్తూ పథకం వేస్తున్నాడు. అలంకార్లో ఎన్టీఆర్ బొమ్మ రిలీజయింది. అలాంటిచోట తొక్కిడి ఎక్కువ. సినిమాహాలు చేరుకున్నాడు. ఫస్టుక్లాసు క్యూలోకి ఓ స్టూడెంటు వెళ్ళడం, అతని వెనక నిలబడ్డాడు. అక్కడా అక్కడా పోలీసులు డ్యూటీలు కాస్తూ తిరుగుతున్నారు. ఓ పోలీసు క్యూ బయట నించొని ఒంటిమీద టోపీని సరిచేసుకుంటున్నాడు. వరదరాజులు ముందున్న స్టూడెంటు పర్సులోంచి నోటుతీసి ఎడంచేత్తో పట్టుకుని, పర్సు కుడివైపు ప్యాంటు జేబులో పెట్టుకున్నాడు. స్కూటర్ల మీద జంటలు దిగుతున్నారు. ఆడవాళ్ళ టిక్కెట్లు తీస్తున్నారు. బుకింగ్ లో ఆడవాళ్ళకి టిక్కెట్లిస్తూ, మధ్య మధ్య మగాళ్ళకిస్తున్నారు. క్యూ కదలటంలేదు.

టైమవుతోంది. ఆడ జనాభా పెరిగిపోతోంది. మగాళ్ళక్యూ క్రమంగా తగ్గుతోంది. వరదరాజులు ముందున్న స్టూడెంట్ కౌంటరు దగ్గర కొచ్చేటప్పటికి స్కూటర్ దిగిన తెల్లగా ఆరోగ్యంగా వున్న అమ్మాయి

స్కూటరు దిగింది. తలంటు పోసుకున్న కత్తిరింపు జుత్తుకి నుదురు మీదుగా రిబ్బను కట్టుకుంది. లుంగీ గౌను ధరించి వుంది. పెద్ద కళ్లద్దాలు (రంగువి) న్నాయి. అందరి కళ్ళూ ఆ అమ్మాయి మీదే వున్నాయి. వరద రాజులు ముందున్న అబ్బాయి అచేతనంగా నిలబడి చూస్తున్నాడు. కొన్ని సెకండ్లు వరదరాజులు కూడా అలాగే చూస్తూవుండి పోయాడు. రత్నాలు గుర్తొచ్చింది. తన పని గుర్తొచ్చింది. చుట్టూ చూసేడు, తన నెవరూ చూడడంలేదు. ముందున్న అబ్బాయి అమ్మాయి ధ్యానంలోనే వున్నాడు. వరద రాజులు పని సుళువుగా నెరవేరింది ఆ యువతి టిక్కెట్టు తీసుకుని జుత్తు సవరించుకొని స్టయిల్‌గా నడుస్తూ హాల్లోకి వెళ్లింది. స్టూడెంటు నోటు కౌంటర్లో ఇచ్చి "నెక్స్ట్ సీట్ ప్లీజ్" అన్నాడు. టిక్కెట్టు తీసుకున్నాడు. వరదరాజుకూడా టిక్కెట్టు తీసుకుని క్యూలోంచి బయటపడ్డాడు. నాలుగు వేపులా మరోసారి చూసేడు. తనని పోలీసులు గమనించలేదు.

ఆ పిల్ల బాగుంది! సినిమాకి వెళ్లాలా? వద్దా? మేటనీ వొదిలేసరికి చీకటిపడుతుంది. దీపాలు పెడతారు. దీపాలు పెట్టాక బట్టల కొట్లోకి వెళ్లకూడదు. రూపాయిపావలా చీటీ బట్టని ప్రింటెడ్‌లాన్ అని చూపించి అయిదు రూపాయిలు గుంజుతారు. అది వ్యాపారం! పట్టపగలు కళ్లలో కారం కొట్టి చేసేదోపిడీకి సొజాకైన పేరే వ్యాపారం! అంచేత పొద్దుండగానే బట్టల షాపులకి వెళ్లాలి!

మరి టిక్కెట్టు? డబ్బులు దండుగవుతాయని వుసూరుమన్నాడు వరదరాజులు. గురువులు కనిపించాడు "బొమ్మ కొచ్చేవేటి గురూ? ఒక్కడివేనా?" అనడిగాడు.

"ఒకణ్ణి కాపోతే—ఫస్ట్‌క్లాస్ టిక్కెట్టు కొని సినిమా సూణ్ణానికిష్టపడద్దిరా మీ గురువమ్మ? కేజీ బియ్యంవొస్తాయని లెక్క లేస్తాది!

అప్పరేగాని మనకి కొంచెం పనుంది! నువ్వీ టిక్కెట్టుతో బొమ్మకెళ్లు"

"తేంక్స్‌గురూ! ఏటికత?"

"ఎవుడెహె! సినిమా కెళ్లమని టిక్కెట్టిస్తే అడ్డు పెశ్నేస్తాడు? ఆనక చెప్తాలే!" కన్ను కొట్టి హాలు బయటికి నడిచేడు వరదరాజులు.

మళ్లీ ప్రశ్నలు.



బట్టలే కొట్లో తియ్యాలి?

రత్నాలు కెలాటి బట్టలు బాగుంటాయి?

పర్సులో డబ్బులెన్నున్నాయి?

... ముందది చూడాలి. హోటలుకి నడిచేడు స్పెషల్ టీ ఆర్డరిచ్చేడు రత్నాలుకి కాఫీ యిష్టం. అయినా అయిదు పైసలు తక్కువని టీ తాగుతుంది. టేబులు మీదున్న సాసర్లో సోపు గింజలు నోట్లో వేసుకున్నాడు. కేబిన్‌లోకి చూస్తూ నవ్వుల్తున్నాడు. స్ప్రింగ్ తలుపుల కింద నుంచి చీర కుచ్చెళ్లు,జోళ్లు కనిపిస్తున్నాయి. రత్నాలుతో ఆ గదుల్లో కూచుని స్పెషల్ టీ తాగాలి అదొప్పుకోదు. డబ్బులు దండగంటుంది ఆ డబ్బెడితే కూర కొనుకోవచ్చంటుంది అదన్నిటికీ లెక్క లేస్తాది. లెక్క లెయ్యడం తనకి నచ్చదు. తను చేసే చాలా పనులు దానికి నచ్చవు. అయినా, ఒకరి కొకరు కావాలి.

టీ వచ్చింది. తాగుతూ ఆలోచిస్తున్నాడు. ఏ షాపు కెళ్లాలి? పెద్ద కొట్లలో బేరమాడ కూడదు. చిన్న షాపుల్లో ఎంచుకుందికి కావలసినన్ని రకాలుండవు. 'హైకో' లోనో, చేనేత బట్టలషాపుల్లోనో కొనాలి. బేరమాడక్కర్లేదు.

కేబిన్లోంచి నలుగురమ్మాయిలు మాట్లాడుకుంటూ నవ్వుకుంటూ బయటి కొచ్చేరు. అందులో ఒకమ్మాయి కట్టిన చీర బాగుంది. గళ్లచీర. గళ్లమధ్య కుట్టుపువ్వులు. పెద్దఅంచు. అలాంటిది కొనాలి. అలాంటిది దొరికితే బాగుణ్ను!

టీ బాగుంది. తాగడం పూర్తయింది సిగరెట్టు వెలిగించి బిల్లు తీసుకుని కౌంటరు దగ్గరికి నడిచేడు. జేబులోనుంచి రూపాయి తీసి, బిల్లూ రూపాయినోటూ యిచ్చి చిల్లర తీసుకున్నాడు. చిల్లరడబ్బులు జేబులో వేసుకుని, పర్సుతీసి చూసేడు కొత్త పదిరూపాయిల నోట్లు, మొత్తం యాభైరూపాయిలున్నాయి. పర్సు జేబులో పెట్టుకున్నాడు ఫర్వాలేదు కుట్టుపువ్వుల గళ్లచీర కొనొచ్చు చిల్లర తీసుకుని మెట్లుదిగేడు ముష్టివాడు కనిపించేడు. వాడికి పదిపైసలు వేసేడు 'పిల్లలూ నువ్వు పదికాలాలు సల్లగుండాల' ముష్టోడి దీవెనకి నవ్వొచ్చింది. తనకింకా పెళ్లవలేదుకదా!

రెండడుగులు వేసేడు. ఆంజనేయస్వామి గుడిదగ్గర ఆగి, రోడ్డుమీంచే గుళ్లోకిచూసి, నమస్కారం పెట్టి, కదిలేడు. బట్టల షాపుల్లో షో కేసుల్లో బొమ్మలకి కట్టిన చీరలు చూస్తూ నడుస్తున్నాడు.

చేనేత వస్త్రాలయం ముందాగేడు. కొట్టు కెదురుగా నల్లటి ఏంబాసిడర్ కారుంది. కాషియర్ కెదురుగా వయసు మళ్లినాయన కూచుని మాటాడుతున్నాడు. షాపులో కొనే వాళ్లకంటె సేల్స్‌మెన్ ఎక్కువమందున్నారు. మంచిదే! తీరిగ్గా నాలుగు రకాలు చూసి యెంచుకోవచ్చు.

చీరెల కౌంటరు దగ్గరకి వెళ్లేడు "చీరెలు కావాలండీ!" అడిగాడు. సేల్స్‌గర్ల్ మూడు చీరెలు తీసి చూపించింది "గళ్లచీర—పెద్దంచున్నది చూపించండి" మరో నాలుగు చీరలు బల్లమీది కొచ్చేయి. వరదరాజులు చూస్తున్నాడు. మొదట చూపించినవి బీరువాలో సర్దుతోందా అమ్మాయి గళ్ల చీరలే! పెద్దంచులున్నాయి! కాని కుట్టు పువ్వులు లేవు వరద

## ఉత్తరాలు

(6 వ పేజీ తరువాయి)

......పోతే 'వత్సల' వూహించిరాసిన కథకాదు ఒక అమ్మాయి జీవితం. దీనిలోని ఎదైనా వంటి క్కొ అమ్మాయి జీవితం బాగుపరచగలిగినా—ఆ మాత్రం ప్రయోజనం చాల అనుకుని రాసిన కథ. అందుకు బహుళప్రచారంగల పత్రికలో కథ ప్రచురితం ఐతే—నలుగురు చదువుకోగలరన్న ఉద్దేశ్యంతో మీ పత్రికకు పంపించాను. .తే ఇదివరకే ప్రింటైన కథని తిరిగి ఏ పత్రికకి పంపించినా అది అభ్యంతరకరమైన విషయం అని తెలియకపోవటం వల్ల మీకు పంపించటం జరిగింది పైగా కథలు రాయటం నా వృత్తికాదు. కాబట్టి నాకు కథలు రాసేవాళ్ళు ఏవి నియమాలు పాటించాల్సి వుంటుందో స్పష్టంగా తెలియదు. నేను ఈ కథకి రెమ్యూనరేషన్ గూడా తీసుకోలేదు. అందుకు తిరిగి ఏ పత్రికకైనా ఈ కథ పంపించవచ్చు అనుకున్నాను.

ఈ కథని "వత్సల"అన్న టైటిల్ తోనే మీకు పంపించాను "శుభోదయం" అన్న టైటిల్ పేరు పెట్టుకొన్నదే.. కారణం ఏదైనా మీకు ఇబ్బంది కలిగించినందువలన చింతిస్తున్నాను సెలవండి వుంటాను — అభినందనలతో.

బొమ్మ హేమాదేవి (హైదరాబాదు.)

### కథలు

చంద్రకళ ముఖ చిత్రంతో వెలువడిన సంచికలోని, రుద్రరాజు శ్రీదేవి రాసిన "నీలోనే [illegible]ను" అనే కథ, బేతాళకథకు సరిగ్గా వుంది ఇంక ఎవరలో,

(46 వ పేజీ చూడండి)

రాజులు అలోచనలో పడ్డాడు. 'అలాటి చీర లేదా?' అతని కళ్ళలో అనుమానం, అసంతృప్తి.

"ఇంకేమైనా వెరైటీలు చూపించమంటారా?" సేల్స్‌గర్ల్ ప్రశ్న.

"ఇలాటి వాట్లోనే కుట్టు పువ్వులున్నవి కావాలండీ!" ఆతృతగా అడిగాడు.

"ఒకటుండాలి. చూస్తానుండండి" బీరువా ఆ చివరనుంచి ఈ చివరకీ, పైకీ కిందకీచూసి ఒక చీరె తీసిందామె. మడతలు విప్పి బల్లమీదుంచింది.

అదే! 'అలాటిదే! వరదరాజులు కళ్ళలో గొప్ప తృప్తి. ఖరీదడిగాడు. లేబిలు చూసి 38-75 అనిచెప్పి, ఇంకేమైనా కావాలా అనడిగిందామె.

"చీరలొద్దు. జాకెటు గుడ్డలు కావాలి"

"ఆ కౌంటర్లో వున్నాయి"

అటేపు చూసేడు. చీర కవర్లో పెట్టబోతోంది సేల్స్‌గర్ల్. "ఉండండి. దీనికి సరిపడే కలర్ చూపించమనండి"

మరో సేల్స్‌గర్ల్ చీర రంగుకి యించుమించు మేచ్‌అయే గుడ్డలు అయిదారు టేబిలు మీదుంచింది. జాకెట్ గుడ్డ ఎలాటిది కొనాలోవరదరాజులుమొదటఅనుకోలేదు.

"అలాటి రంగే కావాలా ?" ఆమె ప్రశ్న.

మళ్ళీ ఆలోచన! రత్నాలు ఎలాటివి వేసుకుంటుంది—అంత పరిశీలనగా చూళ్లేదు.

"ఆ చీరకి ఏది బాగుంటుందో మీరే చూడండి."

"ఎన్ని మీటర్లు కావాలి ?"

వరదరాజులికి తెలియదు. మాటాడలేదు. జాకెటు బట్టలు చూస్తూ వుండిపోయేడు.

"ఆవిడెలా వుంటారు ?"

"మీలాగే. మీ అంత తెలుపుకాదు"

వరదరాజులు జవాబుకి నవ్వుకుందామె.

"ఎంత వయస్సుంటుంది?" అడిగిందామె.

"19 ఏళ్ళు"

"70 పాయింట్లు తీసుకోండి."

తలూపేడు వరదరాజులు అంగీకరిస్తూ.

ఆమె బట్టకొలిచి కత్తిరించి, పక్క కౌంటర్లో యిచ్చింది. మొదటామె చీర, జాకెటుగుడ్డ కవరులో వుంచి బిల్లురాయించి కేషియర్ దగ్గరికి పంపించింది. కేషియర్ వయసుమళ్ళినాయనతో మాట్లాడుతూ వరదరాజులు దగ్గర డబ్బుతీసుకున్నాడు.

వరదరాజులు కౌంటరు దగ్గర కొచ్చేసరికి ముసలాయన లేచేడు అరచేతివేపున్న వాచీ చూసుకుని "వస్తానండీ" అన్నారు. కేషియర్ కొంచెం లేచి, "చిత్తం! అప్పుడప్పుడు వస్తూండండి సెలవు" అంటూ సమస్కారం పెట్టి మామూలుగా కూచున్నాడు.

కౌంటరుమీద రెండు పార్శిల్లున్నాయి. ఒకటి ముసలాయనది. మరొకటి వరదరాజులిది. వరదరాజులొచ్చేసరికే ముసలాయన బిల్లుచెల్లించి రసీదు జేబులో పెట్టుకున్నారు ఫేనుగాలికి వరదరాజులు పార్శిలుమీది బిల్లు రెండోపార్శిలుమీద పడింది. బిల్లులేని పార్శిలు తనదని ముసలాయన అది తీసుకుని షాపుదిగి కార్లోకూచున్నారు. కారు కదిలింది.

బిల్లూ పార్శిలూ తీసుకుని వరదరాజులు కొత్తరోడ్డు జంక్షను చేరుకున్నాడు. అతని మనస్సు ఉబలాటంగా రత్నాలు దగ్గరికి పరుగులు తీస్తోంది. సిటీ రాలేదు. ఆటోవస్తే అందులో వెళ్ళడానికి వరదరాజులు రెడీ! కాని రాలేదు. సెకన్లు యుగాలుగా గడుస్తున్నాయి. షాపులో చూసిన ముసలాయన కారు వెలంపేట పోస్టాఫీసు దాటుతోంది.

బట్టలు చూసి రత్నాలేమంటుందో! మొదట ఖరీదడుగుతుంది. అంత డబ్బు దండుగ పెట్టినందుకు విసుక్కుంటుంది... సిటీ యింకా రాలేదు. బట్టలు మరోసారి చూడాలనిపించింది. ఇంతలో సిటీ బస్సాగింది.

"మార్కెట్, చౌట్రీ, మాయా బజార్, కాలేజి, కల్కట్రాఫీసు, కెజిహెచ్, ఎల్లమ్మతోట...రైల్వే స్టేషన్" క్లీనర్ దండకం చదువుతున్నాడు. బస్సు రద్దీగాలేదు. వరదరాజులు బస్సెక్కాడు. బస్సుకదిలింది. సీట్లో కూచుని వరదరాజులు పార్శిలు తీసిచూసేడు. ఏదీ గళ్ళచీర! తనుకొన్న బట్టలు కావవి! అందులో కూడా చీర, జాకట్టు గుడ్డా వున్నాయి. చీర తెల్లగా, చాలా పల్చగా వుంది. అంచు వెడల్పుగా వుంది. ఖరీదు చూసేడు. గళ్ళచీర కంటె ఖరీదైనదే. కాని రత్నాలుకు నచ్చదు. తెల్లగుడ్డలు మాపోర్చ వంటుంది. జాకెట్టుగుడ్డ బాగుంది. చీర మార్చాల్సిందే. బస్సు రిజర్వు బేరక్సు మించి చౌట్రీ దగ్గ రాగింది. వరదరాజులు బస్సు దిగేడు.

మేటనీ ఇంటర్వెల్లయింది. రోడ్డంతా రద్దీగా సందడిగా వుంది. మరోసారి గురువుల్ని చూడ్డానికి అలంకార్ వేపు నడిచేడు వరదరాజులు. కిళ్లీ కొట్టు దగ్గర బీడీ తాగుతూ కనిపించేడు గురువులు.

"ఏటిగురూ! యెల్లిన పనేమైంది ?"

జరిగినదంతా చెప్పేడుగురువులుకి. ముసలాయన గళ్ళచీరె వాపసు చేస్తే, లేదా చేస్తానని షాపుకి ఫోనుచేస్తే — వెళ్లి తీసుకుందామనుకుంటున్నానని చెప్పేడు వరదరాజులు.

గురువులు చీర చూసేడు. "నువ్వు కొన్నది ఖరీదెంత ? దీనికంటె ఎక్కువా?"

"కాదుతక్కువే"

"మరింకేం ? అదృష్టం కలిసొచ్చిందనుకో, చీర మార్చమాక! అంప రెక్కలాగుంది. మనోళ్లు ఇలాటి బట్టలెప్పుడు కట్టగలరు ? కలిసొచ్చినప్పుడే కట్టాల ! నీకు తెలవదు గాని, ఈ చీరెలో గురువమ్మ అచ్చం సరస్వతీదేవిలా గుంటాది. నా మాటిని యింటికెళ్ళు" బోధపరిచేడు గురువులు.

నిజమేననిపించింది వరదరాజులికి !

# అవీ-ఇవీ-అన్నీ

—ఇంటింటి చిట్కాలు—

## బంగాళాదుంప జిలేబి

బంగాళాదుంపలు పావుకేజి, పంచదార ఒక కప్పు, నెయ్యి ఒక కప్పు, మిఠాయిరంగు కొంచెంగా. ముందు బంగాళదుంపలను ఉడకబెట్టి తొక్క తీయాలి. ఆ తర్వాత వాటిని మెత్తగా పిండిగా రుబ్బి వేయాలి. పొయ్యిమీద 'బాణలి' పెట్టి నెయ్యి వేసి కాగాక జిలేబి గొట్టంలో యీ బంగాళా దుంప పిండి వేసి ఆ కాగిన నెయ్యిలో జిలేబి చుట్టలాగా వేసి వేగనివ్వాలి. ఎర్రగా వేగింతర్వాత తియ్యాలి.

మరో పొయ్యిమీద ఓ వెడల్పాటి గిన్నె వుంచి దాంట్లో పంచదార, కొద్దిగా నీళ్లుపోసి పాకం వచ్చాక మిఠాయిరంగు వెయ్యాలి. ఆ తీసిన జిలేబి చుట్టను యీ పాకంలో వేసి తీసి చల్లారాక తింటే చూడ్డానికి ఇంపుగా, తినడానికి రుచిగా వుంటాయి.

— దారా పార్వతి.

## నిన్న

నా ఆదర్శాలు, ఆశయాలు
అత్యున్నత పర్వత శిఖరాలు
ఉద్రేకాలు ఉద్వేగాలు
ఉన్మత్త కడలి తరంగాలు
ఆవేశాలు ఆవేగాలు
ఉప్పొంగిన నదీ ప్రవాహాలు
భావాల లోతులు, అంతులేని అగాధాలు
ఊహాల రీతులు, చీకటిని చీల్చే కాంతిరేఖలు
నా జీవన ప్రవృత్తులు ప్రకృతి ప్రతిస్పందనలు

## నేడు

నా ఆదర్శాలు ఆశయాలు
కూలిన శిఖరాలు
ఉద్రేకాల ఉద్యోగాలు
విరిగిన అలలు
ఆవేశాలు ఆవేగాలు
ఎండిన తటాకాలు
భావాల లోతులు శ్మశానంలో గోతులు
ఊహాల రీతులు నిశి చెరపని వెలుగు గీతలు
నా జీవన ప్రతిస్పందనలు వాడిపోయిన ప్రవృత్తి ఆక్రందనలు.

## రేపు

భవిష్యత్తు కల
ఆశానిరాశల మధ్య ఊగే డోల.

—బెలమర జోగారావు

**సాహిత్యవనంలో తులసీ దళాలు.**

శ్రీ ఎ. వి. సత్యనారాయణ రాజు సేకరించిన మణి ప్రవాళవంటి సూక్తులనేకం గల "సాహిత్యవనంలో తులసీ దళాలు" మొదటి మాల మా కార్యాలయం చేరింది. 456 పేజీలు గల ఈ పుస్తకం వెల 15 రూపాయలు. ప్రతులకు: సటంశెట్టి రాజా, మొదటి క్రాస్ రోడ్డు, ప్రకాశం నగర్, రాజమండ్రి—3.

**వ్యాస క్రీడలు**

280 పుటల శ్రీ శ్రీ వ్యాస సంకలనం మా కార్యాలయం చేరింది వెల 4—50.

**తిరపతి, మనిషి చావకూడదు (నాటికలు)**

రచయిత ఎస్. ఆర్. నంది. రెండు ప్రదర్శన యోగ్యమైన నాటికలు. పుటలు 102 వెల :2.50

**బంతి పువ్వు :**

కవితాసంపుటి పుటలు 138. వెల రు. 4.00 ప్రతులు మాడు పుస్తకాలకు నవోదయ పబ్లిషర్స్, విజయవాడ—2, గుంటూరు—2.



భారత రాష్ట్రపతి శ్రీ వరాహగిరి వెంకటగిరిగారిని రాష్ట్రపతి పదవికి పోటీ చేస్తున్న శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మదుగారు యిటీవల కలుసుకున్నప్పటి చిత్రం.

# అ పీ–ఇ పీ–అ న్నీ

బొమ్మలాట

శ్రీ ఎ. వి. ఎల్. నరసింహారావు రచన "బొమ్మలాట" నాటిక మా కార్యాలయం చేరింది. 40 పేజీలు. వెల రెండు రూపాయలు. ప్రతులకు పాటిబండ వెంకటకృష్ణయ్య పబ్లిషింగ్‌హవుస్, వల్లూరివారి తోట, గుంటూరు—2.

రాదారి బంగళా

శ్రీ ఆరుద్ర రచన "రాదారి బంగళా" నాటకం మా కార్యాలయం చేరింది. ఫీనిక్స్‌బుక్స్, నూజివీడు వారు ప్రచురించిన 88 పేజీలు గల ఈ పుస్తకం వెల 2 రు. లు. సోల్ డిస్ట్రిబ్యూటర్స్ నవోదయ పబ్లిషర్స్, విజయవాడ—2, గుంటూరు—2.

అమ్మకానికో అబ్బాయి

శ్రీ అవసరాల రామకృష్ణారావు రచన "అమ్మకానికో అబ్బాయి" నవల మా కార్యాలయం చేరింది. 228 పేజీలు గల ఈ పుస్తకం వెల రు. 6.50 పై. ప్రతులకు నవోదయ పబ్లిషర్స్, విజయవాడ—2, గుంటూరు—2.




శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి దివ్య సంస్మరణార్థం కేంద్ర ప్రభుత్వం జులై 15న విడుదల చేసిన 25 పైసల తపాలా బిళ్ళ.

# ఉ త్త రా లు

(4 వ పేజీ తరువాయి)

"మురళిచే వంచించబడిన, బృందను మధూ ఎందుకు పెళ్లిచేసుకుంటానన్నాడు ?" బృంద చేతిలో మురళి బాధలు పడుతున్నాడన్నసంగతి మురళికెలా తెలిసింది?" మొదట మురళిని తిరస్కరించిన బృంద, చివరిలో ఎలా ఆదరించగలిగింది, అని బేతాళున్ని చిక్కు ప్రశ్నలు వేసి, సమాధానం చెప్పకపోతే, తల పగులుతుంది అని రాసి వుంటే ఇంకా బావుండేది. కప్పలు కథానిక బావుంది అని చెప్పడానికి నావద్ద మాటల్లేవు !.....

—ఎమ్. భానుమూర్తి, (కశిబుగ్గ)

'బంగారు కలలు' సీరియల్ ముగింపు సస్పెన్స్‌తో, చక్కటి కొర్టు సన్నివేశాలతో మనసును దోచుకునేట్టు మనోరంజకంగా వుంది.

—జి. గంగాధర్ (జగిత్యాల)

19-7-74 నాటి సంచికలోని "ఇంటల్లుడు" కథ నా హృదయాన్ని బాగా ఆకర్షించినది. సుధాకరు లాంటి యువకులు ఈ సమాజములో ఉంటే ఈ వరకట్నాల బెడద ఎప్పుడో పోయియుండేది.

తంగిరాల కోటిరెడ్డి, (ఇప్పలపల్లి)

రచయిత్రి శ్రీమతి "రాధా రాఘవ్"గారి కలము నుండి వెలువడిన 'రెండు పువ్వులు' నవల రసవత్తరముగా యుంది. రచయిత్రి ఉత్తర, దక్షిణ భారతీయుల అలవాట్లు వారికి గల తేడా జీవిత విధానము తెలిపినందులకు కృతజ్ఞతలు.

బలివాడ శేషగిరిరావు. (విజయనగరం)

5—7—74 సంచికలో 'రుద్రరాజు శ్రీదేవి' గారు వ్రాసిన కథ చాలా చాలా బావుంది. 'స్నేహం' అంటే ఏమిటో, అది ఎంత విలువైనదో ఈ కథలో ప్రస్ఫుటమైంది. కాని మురళి తిరిగి రాగానే మామూలుగా పేరుతో కాకుండా స్వామీ ! అని బృందావని మురళిని సంబోధించటం కథలోని నిండుతనాన్ని స్పాయిల్ చేసినట్టుగా అనిపిస్తోంది.

—డి. సరోజ (కర్నూలు)

5—7—74 సంచికలోను, అంతకుముందు సంచికలోను ప్రచురించబడిన "శ్రీ పిశుపాటి ఉమామహేశ్వరమ్"గారి "కప్పలు" కథ మమ్మల్నెంతో ఆకర్షించింది. "కాని ఫ్రాగ్ రీ ప్రొడక్టరీ సిస్టమ్ ఫ్రాగ్ డిసెక్షన్" అనేవి హైస్కూల్ స్టాండర్డ్‌కు సంబంధించిన పాఠ్యాంశాలుగా రచయిత వ్రాయడము మాకు అంత సమంజసముగా అనిపించలేదు. ఏమయినా కథ చక్కనిది

—గోపాం కామేశ్వరరావు, ఈరంకి రాధా సూర్యప్రకాష్ (రాజమండ్రి)




**Printed and Published by S NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar Vijayawada-3 Editor S Radhakrishna**

